# హరిశ్చంద్ర నాటకములు

విశ్వనాథ సత్యనారాయణ

పాత్రలు :

[హరిశ్చంద్రుడు; మాతంగకన్యలు; విశ్వామిత్రుడు; నక్షత్రకుడు;
చంద్రమతి; లోహితాస్యుడు; కాలకౌశికుడు;
వీరబాహుడు; రాజభటుడు.]

మాతం : అయ్యా! హరిశ్చంద్రమహారాజా! మేము గాయనులము; నాట్య విద్యాపారంగతలము. మా విద్య మీయందు నెఱపి తమదయ పడయ నేతెంచినారము.

హరి : లతాంగులారా! మీ రెవరు?

మాతం : మహారాజా! మేము విశ్వామిత్రమహర్షి కూతుండ్రము. కులముచేత మాతంగకన్యలము. మీ యౌదార్యము, మీ పాండిత్యము విని మీదర్శ నార్థము వచ్చినారము. మహారాజా! మీ రీ వనమునకే విచ్చేయుట మా యదృష్టము. వ్యయప్రయాసల కోర్చి మీ అయోధ్యాపురికే మే మెట్లు రాగలము? ఒకవేళ వచ్చినను మేము మాతంగకన్యల మని మమ్ము మీ సభలోనికే రానియ్యరు.

హరి : ఓ లతాంగులారా! మీరు మాతంగకన్యలని మీరు చెప్పిననే తెలియ వలయును. బ్రహ్మర్షియైన విశ్వామిత్రుని బిడ్డ లగుట మీ మహిమను చెప్పుచున్నది. ఓహో! మీ సౌందర్యము అప్సరస్త్రీలను తలదన్ను చున్నది. మీ విద్యాప్రదర్శనము తప్పకుండ జూచెదను. మిమ్ము గౌర వించుట శ్రీ గాధేయులను గౌరవించుటగా నెంచుచున్నాను.

మాతం : దేవర కనుగ్రహము సంపూర్ణముగా గలిగినది. మేము బయలుదేరిన వేళావిశేషము.

(పాట)

కలిత మధుమాస నవయామినీ
రతిసమయ రసభావగామినీ!
కోర్కెమై పతి చూరగొనగ తన యౌవనము
కనరాక కప్పె రెక్కల చక్రవాకీ. కలిత......

చుట్టుప ల్లావరించి జరుగు పతి గని దాగె
గుట్టుగా జివ్వురాకు గుమ్మువెన్కను శుకీ. కలిత......
మింటిలో పతి వెంటవెంట రాముకతిరుగ
వంటముద్దుల తెరల దాగెను బలాకీ. కలిత......

హరి : కన్యలారా! శహబాసు! ఔచిత్యము చెడకుండ మీరు చేసిన వర్ణన మిక్కిలి ప్రశస్తముగ నున్నది. మీ గొంతులు శ్రుతిపరమావధులుగా నున్నవి. మీ ప్రయోగము దోషరహితముగా నున్నది. మీ యభినయము భరతాచార్యులు గాంచినచో తమ శాస్త్రము ఫలవంతమైన దని భావింతురు.

మాతం : ప్రభూ! విద్యయొక్క చారితార్థ్యము తమవంటి సునిశితమేధావంతు లైన రసజ్ఞశేఖరులయందు ప్రదర్శించుట. ధన్యులము. సెలవు తీసికొందుము.

హరి : అదియేమి! ఊరకే పోవుదురా! మావలన నేదైన బహుమతి గ్రహించి పోవలయును. అట్లు చేయనిచో మమ్ము గౌరవపరచిన ట్లగునుగదా! విశ్వామిత్రమహర్షి కూతుండ్రేమి! మా కడకు వచ్చి యిట్లు రిత్త చేతులతో దిరిగిపోవుట యేమి!

మాతం : మహారాజా! మీ ప్రశంసయే మాకు బదివేలు. మరియు మే మేమి యడిగిన మీ రిత్తురు?

హరి : మీ రేది యడిగిన నది యిత్తును.

మాతం : మహారాజా! తొందరపడి యేదియు వచింపకు. సత్యము మిక్కిలి చెడ్డది. అన్నమాట తీర్చుకొనలేకపోయినచో మృషాభాషితము వచ్చును. అది జీవునకు ముక్తిహేతువు కాదు.

హరి : అవునమ్మా! నే నసత్యమాడను; ఆడజాలను. సత్యమార్గమునే యవలంబించుచున్నాను. సత్యముగా జెప్పుచున్నాను. సత్యమైన మీకోర్కె యేదియైనను దీర్పగలను. అడుగుడు.

మాతం : మహారాజా! ఇది చెప్పుడు. సంగీతాభినయములందు మాకంటె నధికులను మీ రెచ్చటనైన జూచితిరా?

హరి : చూడలేదు. యథార్థము.

మాతం : సౌందర్యమునందు మాకంటె నధికులను మీ రీ భూలోకమునందు చూచితిరా?

హరి : చూడలేదు. నిజము.

మాతం : మేము కన్యలము. నవయౌవనాభిరామలము. అనన్య లగ్నమానసలము.

హరి : నిశ్చయము.

మాతం : తన తపోమాహాత్మ్యముచేత మరొక స్వర్గము సృష్టించిన విశ్వామిత్రుని తపస్సుచేత మేము రక్షితలము.

హరి : అహో! మీ భాగ్యము.

మాతం : మా కొక్కటియే కోర్కె యున్నది. అది తమరు తీర్తుమన్నచో మనవి చేయుదుము.

హరి : నే నింతవర కది వినుటకేకదా వేచియుంటిని?

మాతం : చిత్తము. మేము మాతంగకన్యలమా! విశ్వామిత్రునిచేత సృష్టింపబడినవారము. మాయందు కులదోషము లేదు.

హరి : నిజముగా లేదు.

మాతం : ఇట్టి మాకు బతి కాదగినవాడీ భూలోకమున లేడు.

హరి : లేడు.

హరి : సత్యాసత్యనిర్ణయ మీ మాత్రమున కాదు.

మాతం : ఏమాత్రమున నగును ?

హరి : అది మహర్షులు నిర్ణయింపదగినది.

మాతం : అరుగో! మాతంగ్రిడిగారు. మహర్షులు బ్రహ్మర్షులు. వారినేచేయనిందు.

విశ్వామిత్రుడు : ఓయి హరిశ్చంద్రుడా! మాకు తెలిసినది. నే నీసత్యనిర్ణయమును చేయుచున్నాను. నీవు నా కూతుండ్రను పెండ్లియాడినచో నీ వసత్యమార్గమున నేగినట్టివాడవు కావు.

హరి : బ్రహ్మర్షీ! నీ వాక్కుల మట్టిదేకాని, నీమాటయందే యది యసత్యమని స్ఫూర్తి యున్నది గదా!

విశ్వా : ఓయీ! సత్యాసత్యము లట్లుంచుము. ఈ లోకమునందే సౌఖ్యము సంపాదింపదగినది. అర్థకామముల వెంట బరితృప్తి లేనివానికి ధర్మమోక్షములందు బరమసాయుజ్యము లేదు. అర్థము నీయందు రాజ్యాధీనమై మెక్కువ పండినది. కామతృప్తి నీకీ నా కూతుండ్రయందు బోలె వెఱపోట్ల జరుగదు. అందానికా — ప్రస్ఫుటమందము. విద్యకా — చెప్పరానంతవిద్య. వినయవతులు. తేనెపెరలవంటివారు. ఈ కామదేవత నుపాసింపుము.

హరి : స్వామీ! నన్ను శత్రువుల కప్పజెప్ప నెంచు టేమి ?

విశ్వా : అదియేమి! నా కూతుండ్రు నీకు శత్రువులా ?

హరి : స్వామీ! కామక్రోధాదు లరిషడ్వర్గము. ఈ యారుగురు శత్రువుల బారి బడక ప్రభూ! మోక్షమార్గగామినగు జీవుడను నేను. న న్నేల యిట్లు లాగెదవు ?

విశ్వా : ఓరి పిచ్చిజీవుడా! ధర్మకామమున నీకు జంద్రమతి యున్నది. ఆ బలమున నీ కామము నొకవేళ గెలిచితివే యనుకొందము. తక్కిన యైదుగురు శత్రువుల గెలువ సాధ్యము కాదు. కనుక వీరిని వివాహమాడి శరీరసౌఖ్యమును బూర్తిగా నైనసము చేసికొమ్ము.

హరి : ప్రభూ ! తక్కిన యేనుగురిని గెలువలేముగదా యని గెలిచిన యొకరినీ గూడ లొంగిపొమ్మనుట న్యాయమా ?

విశ్వా : నీ యుద్దేశ్యములో నీ వప్పుడే యీ కామమును గెలిచినట్లే అనుకొనుచుంటివేమి ? వీరిని నీవు పెండ్లియాడక తప్పదు. నీమీద నింతగాస పెట్టుకొని వచ్చిన వీరిని తిరస్కరించుటకు నీకు హృదయ మున్నదా! నీది మనసా, రాయా !

హరి : స్వామీ ! ఈ విషయములో రాయియే.

విశ్వా : ఇంకేవిషయములోరా వెన్న ? దుర్మార్గుడా ! నా కూతుండ్ర కన్నీరు నేను చూడలేను. అయ్యో ! వారిని నీ విట్లు పరాభవింపగా వా రెంత యేడ్చుచున్నారో చూడుము.

(మాతంగకన్యల యేడుపు)

విశ్వా : ఎందుకమ్మా, అంత యేడ్చుచున్నారు ?

మాతం : తండ్రీ ! మా గో డేమని చెప్పుము ? నీవంటివానికి గూతుండ్రమైకూడ మా కీగతి పట్టినది. తండ్రీ ! మేము హరిశ్చంద్ర మహారాజును మనసార ప్రేమించితిమి. ఆయన మమ్ము నిర్దయముగా బాధించుచున్నాడు. అయ్యో ! మా యొడళ్ళు చూడుము. కందెలు కట్టినవి. వాతలు పెట్టినట్లు మా శరీరములు చూడు మెట్లున్నవో ! మా జడలు ముడిపడినవి. పూవులు రాలిపోయినవి. ఒడలి గందమంతయు విచ్చిపోయినది.

విశ్వా : ఏమోయి రాజా ! మాపిల్లలను ప్రేపబెత్తములతో గొట్టినావా ?

హరి : స్వామీ నే నేపాప మెరుగను.

విశ్వా : ఓరి దుర్మార్గుడా ! ఏమి నక్కవినయము ! నీ వేపాప మెఱుగ ననగా, ని న్నెవరు నమ్ముదురు ? దీనికి ప్రతీకార మేమి చేయుమందువు ?

హరి : మీ చిత్తము వచ్చినది చేయుడు.

విశ్వా : ఇదిగో నీశిరస్సునందు దన్నుచున్నాను.

(తక్కుమని తన్నినధ్వని)

ఓయి హరిశ్చంద్రా! ఇప్పుడైనను నీకు బుద్ధివచ్చినదా?

హరి : స్వామీ! క్షమింపుము.

పచ్చని వింటి జోదు శర పంజర శేఖర మార్దవంబునా
నచ్చరయైన మేనక కుచాంతరసీమ సుఖించి మెత్తనల్
మచ్చిక పడ్డ నీదు పదమండలి రత్నశిలాగ్రకర్కశం
బిచ్చటి నా శిరస్సున మఱెంతటి బాధను పొందియున్నదో?

విశ్వా : ఏమోయి, నీ యాక్షేపణ? మేము కామమూషితులము, నీవు కామమును జయించినవాడవునా!

హరి : ప్రభూ! నే నన్నమాట కిది న్యాయమైన యర్థము కాదు.

విశ్వా : సరే! నీ పాదము సర్వసామంతుల శిరస్సుమీద. మా పాదము నీ శిరస్సుమీద.

హరి : చిత్తము విధేయుడను.

విశ్వా : అరరే! తప్పుకాయము తినినా? చీమునెత్తురులు వచ్చినవా? నీ శిరస్సున దన్నితినిగదా! క్రోధము లేదా?

హరి : స్వామీ! నాకు గాను మెప్పుడు వచ్చినదో, క్రోధము నపుడే వచ్చినది.

విశ్వా : ఓరి మూర్ఖుడా! నాతో మాటాడుచు మాటాడుచునే క్రోధమును గూడ గెలిచితి నని చెప్పుచున్నావా! ఒకవేళ నీ వెంటిని గెలిచినను, మిగిలిన శత్రువులు ఇంకను నల్గురున్నారు. మా బలమే యెక్కువగా నున్నది.

హరి : స్వామీ! ఎప్పుడును అరిషడ్వర్గము యొక్క బలమే యెక్కువ. నా దలంపు నీ దయామహిమవలన ప్రయత్నమే.

విశ్వా : ప్రతిపదమును నా యాజ్ఞ తిరస్కరించుచు, నా దయామహిమ యందువు. సరే, కామక్రోధములు గెలిచితివి. లోభము నెట్లు గెలువగలవో చూచెదను. లోభమును గెల్చుట సామాన్యమైనది కాదు. మాపాదములచేత

(1.)

దన్నబడిన శిరస్సు గలవాడవు నీవు పోయి మఱల నెట్లు రాజ్యమును జేయుదువు? సిగ్గుమాలి నీవు వెళ్ళినను నీసామంతరాజులు నీపాదముల వద్దకు జేరుదురా? నీ మూర్ధాభిషేక మేమైనది? నా కాలుతగులుట చేత మహిమ మాసిన నీ కిరీటమును ధరిత్రి యాదరించదు. నీ కింక రాజ్యార్హత లేదు.

హరి : బ్రహ్మర్షి చంద్రమా! ఇదిగో నారాజ్యమును నీ కర్పించుచున్నాను.

మునుపు సహస్రముల్ నృపులు పొంది సుఖించి త్యజించి యీరసం
జనిత ధరిత్రి పిప్పి, రససౌఖ్యము నాకును లేదు రాజ్యలో
భనియతి నిన్నువంటి ఋషి వచ్చి యొసంగు మనంగ, కాదు కా
దను మతిహీనతంజనెడునంతగ నాయెడ లేమునూ ప్రభూ!

విశ్వా : ఏమి, నిజముగా నీ రాజ్యమును నా కిచ్చితివా!

హరి : స్వామీ! నిజముగా నొకటియు, నబద్ధముగా నొకటియునా!

విశ్వా : మఱి అట్లయినచో నీ భూషణములు, నీ వల్వలు, నీ రాజచిహ్నములు నన్నియు నిక్కడ నుంచుము.

హరి : చిత్తము. ఇవిగో.

విశ్వా : నీ వింక బోవచ్చును.

హరి : పోవుచున్నాను.

విశ్వా : కాదు. ఆగుము. అరే! నేను నాకు రాజ్యము వచ్చినదన్న సంతోష ములో మరచిపోయినాను. ఏమి? నీవు కామక్రోధలోభములను మూటినీ గెలిచితివా?

హరి : స్వామీ! నేను గెలుచుట యేమున్నది? నేను గెలుచుటయు లేదు, ఓడుటయు లేదు.

విశ్వా : ఓయీ! నీవు భయపడుచుంటివి.

హరి : దేనికి?

విశ్వా : మోహము, మదము, మాత్సర్యము ననియింకను మూడున్నవి. వానినిజూచి,

హరి : ప్రభూ ! నేనే యేమి ! సర్వజీవకోటియు వీనినిగూర్చి భయపడదగినదే. ఈ యూరుగురు శత్రువులేనా ? ఈషణత్రయము లేదా ! దారేషణ, పుత్రేషణ,ధనేషణములు. ఇవి యెల్లపుడు సర్వజీవులను బ్రతారించుచునే యుండునుగదా !

విశ్వా : చక్కగా జ్ఞాపకముచేసితివి. ఈ శత్రువు లార్వురు; ముగ్గురను నీవు గెలిచితివి. సమానబలవంతుల మైతిమి. ఎట్లా అనుకొను చున్నాను. అసలు మా బలము తొమ్మండుగురు. నీవు ముగ్గురినే గెలిచినావు. ఇంక మా కార్గు రున్నారు. మాబలమే యెక్కువ యున్నది. ఏమిచేయుదువు?

హరి : ప్రభూ ! యేమి చేయగలను?

నాకు నీ రెండె దిక్కు కంఠస్థకాల
కూట మగు తేజమును, మహానికోటిదయయు
నఖిలజీవాళిబంధక మైనయట్టి
యీ విరోధి చమూరోధి త్రోవయందు.

మఱియు నా స్వామీ ! ఇతరసర్వర్షుల దయయు నొకయెత్తు. నాకు నీదయ యొకయెత్తు.

విశ్వా : ఎందుచేత నేమి?

హరి : బ్రహ్మర్షీ ! నీవు నా వంశీయుడవు. ఈ శత్రువులను నీవలె గెలిచిన వా డెవడు ? ఓహో ! యేమి గెలుపు గెలిచినాడయ్యా, విశ్వామిత్రు డీశత్రువులమీద ? ఇతరుల కలభ్యమైన బ్రహ్మర్షిత్వమును సంపాదించి నాడు.

విశ్వా : అట్లే సంతోషించుచుండుము. మఱి నీ కిపుడు రాజ్యములేదు. ఎట్లు బ్రతుకగలవు ? ఊరూర బిచ్చమెత్తుకొని బ్రతికెదవా ?

హరి : "ఆయురన్నం ప్రయచ్ఛతి" ఆయువున్నచో నన్నమదియే దొరకును.

విశ్వా : ఈభార్య చంద్రమతి,కొడుకు లోహితాస్యుడు_ వీరి నెట్లు పోషింతువు?

హరి : స్వామీ ! నేనే వీరిని పోషించుచుంటినా ? పరమశివుని దయ.

విశ్వా : అడవుల వెంట బడిపోవుచో బులులు, లోడేలు, సింగములు, ఘాతా శాది గ్రహములు. వీనివలన నీకొరెట్లును సాహస మున్న్యేడిదే.

హరి : ప్రభూ! శివుని యాజ్ఞలేక చీమయు కుట్టదందురు. ఆ ప్రభువు నాజ్ఞ యయినచో, నేను పట్టి నిలుపదగినదియు లేదు.

విశ్వా : నీవు భార్యాపుత్రులను పోషించవలయునన్న, ప్రేమయున్న వాడవయి నచో రాజ్యమే వదలిపెట్టవు. నీ జోలి నా కెందుకు ? పదిసమూళ్లలో దిరిపమెత్తుకొను జోలె. పో! పో!

హరి : స్వామీ! సెలవు.

విశ్వా : మఱి మరచిపోయితిని. వెనుక నేను నచ్చి "నే నొక యజ్ఞమును చేయ దలచితిని. దానికి గొంత సొమ్ము కావలె"నని యడిగితిని. నీ విత్తునంటివి. జ్ఞాపకమున్నదా ?

హరి : చిత్తము.

విశ్వా : ఆ సొమ్ముమాట యేమి ? నీ వద్ద గాగిదమ్మిడియు లేదు, ఎట్లు తీర్చెదవు ? (నవ్వి) చూచితివటోయి, రాజా! ఏమో సత్యవ్రతము పాలింతు నను కొన్నావు. ఇప్పుడేమైనది? ఆ ధనము నీ వెట్లుసీయగలవు. అందుచే నబద్ధ మాడినట్లయినది. సత్యవ్రతము పోనేపోయినది. కనుక నా కుమార్తెంద్రను బెండ్లియాడుము. నీరాజ్య మంతయు నీకు నరణముగా నిచ్చెదను. మహా రాజవుగా నుందువుగాని.

హరి : ప్రభూ! నాకొక నెలనాళ్లు గడువిమ్ము. నీ ఋణమును దీర్చెదను.

విశ్వా : ఋణము దినములతో దీరదు. ధనముతో దీరును.

హరి : నా త్రిప్పలు నేను పడెదను.

విశ్వా : నిన్ను నమ్మి వదలిపెట్టుమందువా ?

హరి : నా వెంట నెవరినైన బంపింపుడు.

విశ్వా : తా దూర సందులేదు, మెడకొక డోలట! నీ పెండ్లమును బిడ్డలను బోషించు కొన్న జాలును. వానినిగూడ నెక్కడ పోషించెదవు ?

హరి : మేము పస్తుండియైనను వాని నారగింప జేసెదను.

విశ్వా : సరే. మా కొత్త శిష్యుడున్నాడు. వానిపేరు నక్షత్రకుడు. బహు సుకుమారి. వానిని నీ వెంట బంపెదను. ఒకనెలనాళ్ళలో మా సొమ్ము వాని చేతికిచ్చి పంపింపుము. వా డావులించినచో బ్రేవులు లెక్కపెట్టెడు వాడు. వానిని మోసముచేయ జూడకుము. నీవంటి వారికి వందమందికి చదువు చెప్పగలవాడు.

హరి : చిత్తము. మావెంట బంపించుడు.

విశ్వా : నీవు పోవుచుండుము. అతడు దారిలోవచ్చి మిమ్ముకలసికొనును. నేను పోవుచున్నాను.

హరి : ఆహా! విశ్వామిత్రఋషి వెళ్ళిపోయెను. చంద్రమతీ! నా వెంటనే వచ్చుచున్నావా!

చంద్ర : వచ్చుచున్నాను మహారాజా!

హరి : బిడ్డా లోహితా! నీవును నావెంట వచ్చుచున్నావా!

లోహి : వచ్చుచున్నాను నాయనగారూ!

హరి : నాయనా! ఆ నక్షత్రకుడన్నాయన వచ్చెనా?

లోహి : ఎవరో వచ్చుచున్నారు. ఆయనరయే కాబోలును.

నక్ష : నేనేనయ్యా! నక్షత్రకుడను. నీవేగా హరిశ్చంద్రుడవు?

హరి : చిత్తము.

నక్ష : నీవు కామక్రోధలోభములను గెలిచితి వటకదా!

హరి : అది యేమియు లేదు ఋషిపుత్రా! విశ్వామిత్రఋషి కూతుండ్రు మాతంగకన్యలను నన్ను పెండ్లాడుమనెను. నే నిష్టపడలేదు. అంతే.

నక్ష : తలమీద దన్నగా నీకు కోపము రాలేదట గదా!

హరి : కోపమా? యెవరిమీద?

నక్ష : తన్నినవారిమీద.

హరి : తన్నిన దెవరు? విశ్వామిత్రఋషి. ఆయనమీద కోపమా?

నక్ష : నేను తన్నెదను. వచ్చునా?

హరి : స్వామీ! నీవు ఆ ఋషితరువాత నాఋషియంతటివాడవు. నీమీద మాత్ర మెట్లు వచ్చును?

నక్ష : ఇంకెవరిమీద నయిన వచ్చునా ?

హరి : ఎందుకు రావలయును స్వామీ! ఆతలివానికి గోపము వచ్చిరయేకదా తన్నుట? ఆకోపము చాలదా ఒకజీవి కలుషిత మార్గమున బోవుటకు! మఱియు నిం కొకజీవి యా కలుషపథమున నే యేల పోవలయును?

నక్ష : అట్లనెడువాడవు నీవు తప్పక యూరకుందువు – సరే. కామక్రోధలోభ ములను గెలువలే నందు వేమి? గెలిచితివి, గెలువలేదు. అది నాకెందుకు? నీవు మా గురువుగారి కప్పుపడినావట. నన్ను వసూలుచేసికొని గమ్మ న్నారు.

హరి : ఒకనెలనాళ్ళు గడు వడిగినాను. ఈనెలనాళ్ళు మీరు మాతో కలిగియో, గంజియో త్రావియుండవలెను.

నక్ష : ఈ యడవిలో నదికూడ దొరకునా ?

హరి : అంతకంటె మంచివిరయే దొరకును. ఆరమగ్గిన ఫలములు, సెలయేటినీళ్లు దొరకును. అంతకంటె కావలసిన దేమి?

నక్ష : నాలుక కొక రుచి. అదియుగాక రాజా! నీవు సర్వభోగము లనుభ వించినవాడవు. అందుచేత నీకు విసుగెత్తి యడవిజీవితమునం దభిరుచి యేర్పడియుండవచ్చును. మే మెప్పు డడవిలోనే యుంటిమి. మాకు రాజభోగములు కావలయు ననిపించును.

హరి : మీ కీ కష్టము మాతో నొక్కనెలనాళ్ళమాత్రమే కదా!

నక్ష : ప్రాణములు పోవుటకు నొక్కనెల చాల యెక్కువయిన కాల మది తెలియునా ?

హరి : పరమేశ్వరుని దయ లేనిచో నంతియే స్వామీ!

నక్ష : సరే, చాలదూరము నడచితిమి. ప్రొద్దు క్రుంకినది. ఈ యడవిలో ప్రొద్దు క్రుంకకముందే క్రుంకునయ్యా! ఈయడవిలో పండుకొనుట యెక్కడ?

హరి : ఈ చెట్టుకొమ్మలు వ్రాలి జీబుగా నల్లి యిల్లు కట్టినట్లున్నది. ఈలోపల బాగుచేసెదను. మీరు ముగ్గురిందు నిద్రించుడు. నేనురక్షించుచుందును.

నక్ష : మఱి తిండిమాట యేమి చెప్పితివి ?

హరి : ఇవిగో ఫలములు. సుంతదూరాన జలము ప్రవహించు సవ్వడి వినవచ్చు చున్నది. పోయి జలము తీసికొనివత్తును.

నక్ష : ఈలోపుగా మమ్మేపులియైన వేసికొనిపోవుచో ?

హరి : స్వామీ! పులులు మనుష్యుల జోలికిరావు. వానిని జూచిన మనుష్యుల కెంత భయమో, మనుష్యులను జూచిన వానికి నంత భయము. ఇంతలో వచ్చెదను.

(పెద్ద కేకలు, అరపులు)

నక్ష : అమ్మయ్యో! దయ్యాలు, భూతాలు. నేనీ చెట్టుక్రింద నిదురపోను.

హరి : ఎందుకీ భయము ఋషికుమారా!

నక్ష : ఎందుకేమిటయ్యా! కనులులేవా? వాడెవడో భేతాళుడు. అంతకోరలు, అంత కనులు. చేతిలో నంతకత్తి. అమ్మగొయ్యో!

హరి : నక్షత్రకా! భయపడకుము. నీవు దయ్యము లనుచుంటివి. భేతాళు డనుచుంటివి. నా కెవ్వరును కనుపించుటలేదు.

నక్ష : కనుపించుటలేదా! నే నబద్ధము చెప్పుచుంటి నందువా ?

హరి : శివశివా! నే నామాట యందునా! నాయనా, లోహితా! నీకాదయ్యములు కనుపించుచున్నవా!

లోహి : నాయనగారూ! మొదట గనిపించినవి. ఇప్పుడు కనుపించుటలేదు.

హరి : దేవి చంద్రమతీ! నీ వా దయ్యములను జూచితివా ?

చంద్ర : స్వామీ! ఈ కుర్రవాని డరచుచుండగా దూరదూరాన నేవో వికారాకారములు భాసించి మాయమైన ట్లున్నది.

నక్ష : ఓయి హరిశ్చంద్రుడా! మా ఋగ్గురకు గన్పించెనుగదా! నీ కేల కన్పించదేమి?

హారి : ఇది వట్టి మోహము.

సత్య : అనగా ?

హారి : భ్రాంతి.

సత్య : అనగా నీవు దయ్యాలు లేవందువా!

హారి : భ్రాంతిమతుల కుండును.

(పాట)

గళదసృక్సంఘాత కంఠాంతరప్రాణ
దళనఘోరమ్ము మద్దంష్ట్రాప్రమాణమ్ము
వక్షోవిమర్దనభ్రష్టాంత్రమాలికా
నిక్షిప్తతీవ్రమ్ము నిస్త్రింశకము నాది
క్షుణ్ణాంగసంచయక్షోదనాదాట్టహాసటి
దణ్ణంధణధ్వానదర్పమ్ము నాగద.

సత్య : ఓరి బాబోయి! యీ భేతాళుడు తన కోరలతో, కత్తితో, గదతో నాప్రాణములు లాగునట, నాగుండె త్రెమ్మునట, నా శరీరము చిదుక బొడుచునట.

హారి : సటూ త్తమా! భయపడకుము.

సత్య : హారిశ్చంద్రా! నీ కాభూతములు కనిపించలేదు. సరే. ఆ భేతాళు డన్నమాటలు నీకు వినిపించెనే!

హారి : నాకు వినిపించలేదు.

సత్య : ఓయిరాజా! నీకు కనులున్నవా! చెవు లున్నవా! నీవు మనుష్యుడవేనా! నీవు బ్రతికియున్నావా!

హారి : ఓయి బ్రాహ్మణబాలుడా! నాకు కనులున్నవి, లేవు. చెవులున్నవి, లేవు. బ్రతికియున్నాను, లేను. ఇదియంతయు భ్రాంతి కదయ్యా! కను లేమి చూచును. చూచునది లోనున్న జీవుడు. బ్రతుకుట యేమని?

చచ్చుట యేమి? ఈ శరీరమునుండి జీవుడు తనదారి తాను పోగా చచ్చుటగాను ననుకొనుదురు. ఎవడు చచ్చిపోవును? ఇది యంతయు నొక మహామోహము.

సత్య : అయ్యో! నాగురువు నాతో నబద్ధము చెప్పెనుగదయ్యా!

హరి : అయన యేమి చెప్పెను?

సత్య : నీవు కామ క్రోధ లోభములను మూడింటినే గెలిచితి వని చెప్పెను. అయ్యో! నీవు మోహమునుగూడ గెలిచితివి. ఓయి! రాజా! మోహమును గెలిచినవాని కరిషడ్వర్గ జయము సులభము. మదమాత్సర్యములను గెలుచుట నీ కెంతటి పని?

హరి : తెల్లవారవచ్చుచున్నది. బయలుదేరి పోదమా?

సత్య : ఎక్కడకు?

హరి : స్వామీ! ఎక్కడకా? ఎల్లజీవులు – ముక్తి వాంఛించు నెల్లజీవులు ఎచ్చటికి బోదురో అక్కడకు. కాశీక్షేత్రమునకు. అవిముక్తభూమికి. శ్రీవిశ్వేశ్వరసన్నిధానమునకు.

సత్య : శివుడు నీ కేమైన బాకీయున్నాడా?

హరి : అయన నాకేమియు బాకీలేడు ప్రభూ! నేనే ఆయనకు బాకీయున్నాను.

సత్య : ఈమాట నాకు గురువు చెప్పలేదే. ముందు మాబాకీ తీర్చి తరువాత నాయనబాకీ తీర్చుము. నీవు సంపాదించెడు ధనమంతయు నాయన ఋణమునకే సరిపోయినచో నే నేమి చేయగలను?

హరి : బ్రాహ్మణవటూ! ఆయన ఋణము ధనఋణము కాదు. మాయ యను నొక వస్తువు కాని వస్తువు నా కాయన యిచ్చినాడు. మరల నాయనది యాయన కిచ్చివేయవలయును.

సత్య : అయినచో నిన్నుగురించి మేము మిక్కిలి జాగ్రత్త పడవలయును. సరే గాని హరిశ్చంద్రా! ఇదిగోనయ్యా! కాశీ కాపురము. అదిగో మందాకినీ నది.

హరి : అదుగో శివుడు, మహాకాలుడు.

నక్ష : మహాకాలు డనగా నేమి ?

హరి : వటూత్తమా! కాలము ఖండకాలము, అఖండకాలము అని రెండు. సూర్యాది గ్రహచారముచేత కలుగునది ఖండకాలము. నిత్యమైనది, మార్పు లేనిది అఖండకాలము. పరమేశ్వరుడు తత్స్వరూపుడు.

నక్ష : దినములు, నెలలు, సంవత్సరములు ఇవన్నియు నబద్ధమన్నమాట.

హరి : నిజము వటూత్తమా! పరమమైన యసత్యము.

నక్ష : అయినచో నీవు మాగురువుగారి కిత్తునన్న ధనము వెంటనే యిమ్ము. అసత్యమైన కాలపు గడువు పెట్టిన దెగవేయుటకా?

హరి : కాదు, స్వామీ!

నక్ష : అయినచో వెంటనే యిమ్ము.

హరి : స్వామీ! నావద్ద నేమి యున్నది? నాకు మిగిలిన యాస్తి యీ యిద్దరు – నా భార్యయు, నా పుత్రుడును. వీరి నమ్మి నీ ఋణమును తీర్చుకొనుము.

నక్ష : నే నమ్ముట యెందులకు? నీవే యమ్ముము. నా కిదొక బాధయా?

హరి : చిత్తము స్వామీ! నేనే యమ్మెదను.

నక్ష : అమ్ముకో! ఏమని యమ్మెదవు?

హరి : ఈమెను బానిసగా నిచ్చెదను, కొనుమని యడిగెదను.

నక్ష : ఈమె యెవరు?

హరి : నా భార్య.

నక్ష : నీ వెవరు?

హరి : నాపేరు హరిశ్చంద్రుడు. నేను పూర్వ మయోధ్యారాజును. నా రాజ్యము పోయినది. నేను విశ్వామిత్రునికి ఋణపడి యా ఋణము తీర్పలేక నాభార్య నమ్ముచున్నాను.

నక్ష : ఛీ! ఛీ! నీ వేమిటి! హరిశ్చంద్రమహారాజు వేమిటి? ఈమె నీ భార్య కాదు. ఎవరినో యెత్తుకొనివచ్చి యిట్లమ్ముచున్నావు. పద, నిన్ను రాజభటుల కప్పజెప్పెదను.

హరి : కాదు స్వామీ ! నేను హరిశ్చంద్రమహారాజునే. ఈయన, యినగా, నక్షత్రకుడు. విశ్వామిత్రుని శిష్యుడు. ఆ ముని తన ఋణధన మీయన చేతి కిమ్మని నావెంట బంపినాడు.

నక్ష : ఈ దొంగవటువు వీడెవ్వడు ? వీడు నీతో షరీకా! నడువుడు నడువుడు. ఇద్దరును రాజసన్నిధికి నడువుడు.

హరి : ఓయి నక్షత్రకా! అందరును ఇట్లే అందురా! కొంద రెవరో యందురు. నిజముగా హరిశ్చంద్ర మహారాజే నేమో. లేనిచో నింత ధైర్యముగా దన భార్యయని యమ్మజూపునా యని.

నక్ష : అట్టినారేమి, యిట్టివారు నుండవచ్చును. ఓరీ! ఈ హరిశ్చంద్రు డెంత సిగ్గులేనివాడు ? ఎంత రోషములేనివాడు ? ఎంత లజ్జాభిమానములు చచ్చినవాడు ? ఇంత బ్రతుకు బ్రతికి ఛీఛీ యీ పనియా చేయుట ? ఏ మొగము పెట్టుకొని భార్య నమ్ముదును అనియయిన ననుకొన లేడేమిరా యని.

హరి : వటూత్తమా ! మద మనగా నెట్లుండునో తెలియునా !

నక్ష : ఎట్లుండును ?

హరి : సరిగా నీవన్నట్లుండును. నే నింతవాడను, నావద్ద నింతధన మున్నది, నే నింత విద్యావంతుడను, ఇవి చేయుట నా గౌరవమునకు దక్కువ— మదముకలవా డిట్లూహించును.

నక్ష : అనగా నీ వట్లూహించ వన్నమాట.

హరి : పూర్వ మెప్పుడో నేను హరిశ్చంద్రమహారాజును. అప్పుడెప్పుడో నాకు రాజ్య మున్నది. రాజ్య మున్నచో భార్యనే అమ్మనక్కరలేదు. రాజ్యము లేనవు డట్లూహింప నేల ?

నక్ష : ఇప్పు డట్లూహించుట మదమా? అప్పు డట్లూహించుట మదమా?

హరి : అప్పు డట్లూహించుట మదము. ఇప్పు డట్లూహించుట మదముయొక్క యాభాసము.

నక్ష : ఆభాస మనగా ?

హరి : అదియు నటువంటిదే! అంతకంటె హీనమైనది.

నక్ష : ఆహా! నాకు దెలిసినది.

హరి : ఏమి తెలిసినది వటుసార్వభౌమా!

నక్ష : నీవు మదమునుగూడ గెల్చితి నని చెప్పుచున్నావు.

హరి : అట్లు చెప్పుటలేదయ్యా స్వామీ! నాకు మద మున్నచో పోగుట యెట్లని మనవిచేయుచున్నాను.

నక్ష : ఓయి బాబోయి, ఇంత డొంకతిరుగుళ్ళు నాకు మాటలతో చేతగావు కాని నీభార్య నమ్మి నాడబ్బు నా మొగాన బారవేయుము.

(కీర్తన)

హరి : నే హరిశ్చంద్ర మహారాజున్
నీరజాతాక్షి యిది నెలత నా కో ప్రజలు॥ నే హరి॥
గాధిజున కే నప్పుపడితిన్
నా ధరిత్రికి నెల్ల జెడితిన్
మునిఋణము తీర్పజాలను లేకయున్న కొం
చున్నాను దయచూడు డన్నానయా ప్రజలు॥ నే హరి॥
గతిమాలితే హరిశ్చంద్రా
మతిపోయెనా తమస్వాంద్రా
అందురా నిజముగా ననదగినవాడనే
సుందరాంగిని వచ్చి చూచి కొనుడో ప్రజలు॥ నే హరి॥

నక్ష : మహారాజా!

హరి : ఆ. ఏమి స్వామీ!

నక్ష : ఆ వచ్చుచున్నాడే బ్రాహ్మణుడు. ఆయనను నే నెరుగుదును. ఆయన పేరు కాలకౌశికుడు. ఓరి నాని దుంప తెగ! వానియంత లోభిసంగడే నయ్యా! వాడు కోరినట్లు చేయవలయును. ఎవరినో యొకరిని మోసా పెట్టవలయును, లేనిచో నెవరు కొందురు ?

హరి : స్వామీ! మోస మెందుకు? నే నాయనను పిలిచి యడిగెదను.

నక్ష : అయినచో బేరము కుదిరినట్లే !

హరి : అతలివానిని మోసముచేయబోమ్ము. నీవు మోసపడవచ్చును. నీవు న్యాయముగా నుండుము. ఆతలివాడును నీయందుమోసము త్యజించును. అయ్యా! కాలకౌశికా!

కాల : ఎవరయ్యా మీరు ?

హరి : స్వామీ! నాపేరు హరిశ్చంద్రమహారాజు.

కాల : ఛీ ఛీ! నీవా! నీ మొగము చూడరాదు.

హరి : ఏమి ప్రభూ! ఏమి తప్పు చేసితిని ?

కాల : అయ్యో! అంతకంటెనా! మన ప్రతిష్ఠ మనకంటె ముందే కాశికా పురము ప్రవేశించినది. విశ్వేశ్వరస్వామి యాలయములో జేగంటగా మ్రోగుచున్నది.

హరి : అయ్యో! ఇంత మాత్రమునకేనా! గుడిలోననేక జా ప్రవేశించినది. స్వామిలో బ్రవేశింపలేదు కదా! అట్టి పనినికూడ జేయుచున్నాను. బ్రాహ్మణోత్తమా! ఈమె నాభార్య. పేరు చంద్రమతి. నేను విశ్వామిత్రమహర్షికి ఋణపడ్డాను.

కాల : చదువకు. చదువకు. నా కంతయు దెలియును. మరి యిపుడు భార్య నమ్ముచున్నావా!

హరి : చిత్తము.

కాల : చిత్తము. భార్య నమ్ముచున్నావా! ఓరి ఘటకుడా! నేను వచ్చితిని గనుక సరిపోయినది. కానిచో మాలవానికైన నమ్మెడివాడవే!

హరి : ఏమి విప్రోత్తమా! మాలవాడు మనుష్యుడు కాడా!

కాల : అయ్యో! ఎందుకు కాడు? నీవే యయినపుడు వా డేల కాడు? వాడు నీకన్న నేయిరెట్లు నయము. వాడు పెండ్లాము నమ్మడు.

హరి : అగును స్వామీ! నాకంటె నీ దృష్టిలో నెవడు నయము కాడు ?

కాల : ఈమెవెల యెంత?

హరి : ఇదిగో ఈ నక్షత్రకునకు దెలియును.

కాల : సరే! ఇంతటి యందకత్తె కెంత యిచ్చిన నీయవచ్చును. ఇత్తును. మరి భార్య నమ్ముట యనగా నేమో తెలియునా!

హరి : అది యేమెనా? అది యెందులో నున్నది?

కాల : నీకు తెలియదు. తెలియజేసెదను. ఒసేవు చంద్రమతీ! యిట్లు రా.

చంద్ర : స్వామీ! చిత్తము.

కాల : ఓసి దుర్మార్గురాలా! నీకు బుద్ధిలేదా! నీవు మనిషివా? పశువవా?

చంద్ర : స్వామీ! ఆజ్ఞాపింపుము.

కాల : ఆజ్ఞాపింపవలయునా! బుద్ధిలేనిదానా! చెప్పకుండ తెలిసికొనలేవటే మందమతీ! నా కాలిని మన్నున్నది. తుడువ నక్కఱలేదా?

చంద్ర : చిత్తము.

కాల : ఓసి చవటదద్దమ్మా! పైటతో దుడిచెదవేమే! ఓ యమ్మ సుకుమారీ! చేతు లేమి విరిగిపోయినవా! రోగమా! నడుము వంచలేవా! రాచ కూతురయ్యా, రాచకూతురు! మహారాణి! పూటకు కూటికి టికాణా లేదు. నాజూకు పోవుచున్నది. వీవు పనులు నట్లు చేయరా! ఏయూ! తెలిసినదా! మనదగ్గర నీయాటలు సాగవు. బోలెడంత సొమ్ము పోసి కొన్నాను. ఇదిగో గడ్డితిను అన్నచో దినవలసినదే. ఉచ్చనీచాలు ఇటు వంటివి మనదగ్గర లేవు. నాకు ఒడలు మండినదా గొడ్డును బాదినట్లు బాదినానే. ఓసి నక్కా! ఏమిచూపులే. అబ్బో! సంగనాచిరా! మాటంటే పడదు. ఏమి రోషము! రోషమేమిటే! రోష మెందుకు! దమ్మిడీకి అమ్ముడు వచ్చినదానవు. నేను చేతులార బోసిన సొమ్ము నీ యమ్మమగని సొమ్మనుకున్నావా! అంతే! ఏమనినను సరే. కుక్కన పేనువలె పడియుండవలసినదే. కుయికుమన్నావా! వెన్నుపాము విరుగును. మాడు చెక్క పగులును. చావు. అంతే! ఏమి దయా! నీపనగా దయ యెందుకు? నీ కొక పనిముట్టువు. బండి చక్రములో సుల్ల లూడినచో నెంత దిగులో నీవు దుఃఖపడినచో నా కంత దిగులు. నీవు ద్రవు పడినచో నా కంతె దిగులు. ఏమిటి! యేడ్చుచున్నావా! నోటిలో రోకలిపెంట గ్రుక్కెదను. ఏదీ! యేడుపు బయటకు రానీ, చెప్పెదను.

నక్ష : కాలకౌశికా! చాలులేవయ్యా! నట్టనడివీధిలోననే యింత చేయుచున్నావు, ఇంటికి దీసికొనిపోయి యింకెంత చేసెదవో!

కాల : చేయక ముద్దుపెట్టుకొనెదగయ్యా! హరిశ్చంద్ర మహారాజా! భార్య నమ్ముకొనుటయనగా నేమో తెలిసినదా!

హరి : తెలిసినది మహాస్వామీ!

కాల : తెలిసికూడ నమ్మితివా!

హరి : తెలిసికూడ నమ్మితిని స్వామీ!

కాల : ఓరి బ్రతికి లేనివాడా! తాను పెంచుచున్న కుక్క నెవరైన నేమైన ననినను లోక మోర్వలేదే! చేసికొన్న భార్యను నే నిట్లనుచుండగా నీ మొగము కూడ గందలేదు. అరే! యెంత మాత్సర్యము లేనివాడవు. మన వస్తువును పెఱవాడు తనదిగా జూచినగా, నిరాకరించగా, దిరస్కరించగా కొంచెము కాకపోయిన గొంచెముయినను మత్సరత్వము పూనని వానిలో బ్రాణ మున్నదని చెప్పుటకు వీలు లేదు.

నక్ష : ఓయి కాలకౌశికుడా! నీ వింక చంద్రమతిని తీసికొని పొమ్ము. హరిశ్చంద్రా! నే నెంత బుద్ధిహీనుడను.

హరి : ఏమి వటూత్తమా! అట్లనెదవు?

నక్ష : పోనీలే, నా గురువుకన్న బుద్ధిహీనుడు కాలేదు.

హరి : శివశివ! అవి యేమిమాటలు?

నక్ష : సరేలే. నాగురువు యొక్క కనుల యెదుటనే నీవు కామ క్రోధ లోభము లను ముగ్గురను గెలిచితివి. నా యెదుట మోహ మద మాత్సర్యములను గెలిచితి వనుట తప్పేమి? ఆయనముందు నే నెంతవాడను! ఆయనకే పారాగతము లేదు, నాకా?

హరి : ఏమి వటూత్తమా! నామీద గోపముగా నున్నదా?

నక్ష : కోపముగా నున్నదా! నెమ్మదిగా నడువుము. సరే. నీ కుమారు డేడీ?

హరి : వాని తల్లి వెంట బడిపోయినాడు.

నక్ష : ఓహో అలాగా? భార్య నమ్మితివా; కొడుకును గూడ నమ్మితివా?

హరి : స్వామీ! నాభార్య నన్ను పరిత్యజించి పోయినదా! నాకొడుకును నాకు వదలిపెట్టి పొమ్మనుటకు?

నక్ష : ఏమిటీ ? చెప్పవు ! ఇంకను నీభార్య నీకు భార్య యనియేనా నీయూహ?

హరి : స్వామీ ! ప్రాణ మున్నంతవఱకు నా భార్యయే.

నక్ష : ఆమాత్రమైన నున్నావు. అక్కడే నాగుము.

హరి : సరి. నేను సెలవు తీసికొందునా?

నక్ష : సెలవా ! విశ్వామిత్రుని ఋణము మాట యేమి ?

హరి : కాలకౌశికుడు తీర్చెనుగదా ?

నక్ష : ఇదుగోనయ్యోయి ! నీకు బ్రతికియుండగా బ్రపంచజ్ఞానము తెలుగదు.

హరి : బ్రాహ్మణాశీర్వచనము.

నక్ష : అది చాల సమృద్ధిగా నున్నది. దాని కేమి? ఆధన మంతయు నాభత్యము ఖర్చుక్రింద నేను తీసికొన్నాను. మునిఋణ మట్లే యున్నది.

హరి : స్వామీ ! మన్నేమి చేయదలచినావు ?

నక్ష : నీవు బ్రతికియు జచ్చినట్లేగదా ! చచ్చినవాని నేమి చేయుదురు?

హరి : వల్లకాటికి జేర్చుదురు.

నక్ష : సరిగా నదియే చేయబోవుచున్నాను.

హరి : చేయుము.

నక్ష : నిన్నమ్మి విశ్వామిత్రుని ఋణధనము సంపాదింతును.

హరి : అమ్ముము.

నక్ష : నాచేతగాదు. నీవే నిన్ను అమ్మి పెట్టుము.

హరి : చిత్తము.

( కీర్తన )

చచ్చెనో బ్రతికెనో జనపాలు డీతండు
వచ్చి జనములు వెల యిచ్చి కొనరండీ !
కచ్చెపట్టిన మౌని గాధిజు ఋణధన
మిచ్చి జనములు వెల తెచ్చి కొనరండీ॥ చచ్చెనో॥
మచ్చర మెఱుగడు మమకార మెఱుగడు
ఇచ్చిన వెల తిరిగివచ్చినట్లే యెల్ల॥ చచ్చెనో॥

నక్ష : హారిశ్చంద్రా! కేకలు వేయుచు నెచ్చటికి వచ్చితిమో తెలియునా?
సరిగా శ్మశానమువరకు వచ్చితిమి.

హారి : నీవు కోరినదియు నదియేకదా!

నక్ష : ఈ శ్మశానమునకు నే నొక నామకరణము చేయుచున్నాను.

హారి : మహర్షి శిష్యుడవు. నీ మాట కెదు రెవ రాడుదురు?

నక్ష : దీనిపే రేమని పెట్టితినో యడుగ వేమి?

హారి : చిత్తము. చెప్పుడు.

నక్ష : హారిశ్చంద్రఘట్ట మని

హారి : హారిశ్చంద్రఘట్టమా! వటువా! యెందుకయ్యా న న్నవహేళనము చేయుదువు?

నక్ష : నీ వేమి తక్కువవాడవా! శివునియంతవాడవు.

హారి : వటూత్తమా! నేను దరిద్రుడను. మీ యప్పు తీర్చజాల కున్నాను
న న్నెవడును వచ్చి కొనడాయెను. మీయప్పు తీర్చజాలమి నీవు న న్నింత వెక్కిరించుచున్నావు.

నక్ష : ఏమి? నీవు శివునియంతవాడవు కా దందువా!

హారి : స్వామీ! నీదయ. న న్నెవరిచేతనైన గొనిపించుము. నాభార్యను గొని పించితివి. నాఋణమును నీవే విమోచనము చేయవలయును.

నక్ష : అయ్యో! నీకోసమా? నా కోసమే. ఇచ్చట వీరబాహు డని యీ శ్మశానపాలకు డున్నాడు. అతడు కల్లుసారాయము లమ్మి చాల సంపాదించినవాడు. ఇంత డబ్బు మరియెవ్వ డీయగలడు? ఈము క్తిక్షేత్రములో నే నెఱుగనివారు లేరు. తెలియునా!

హారి : సర్వతపోమూర్తిశిష్యుడవు. నీకు ముక్తిక్షేత్రము తెలియ దని నే నెట్లను కొనెదను?

నక్ష : అడుగో వీరబాహుడు.

వీర : ఏం దయ్యాది!

నక్ష : ఈయన పేరు హారిశ్చంద్రుడు.

వీర : ఇంకేం? తన గట్టంలోకే వచ్చాడు.

హరి : నక్షత్రకా! నమస్కారము.

నక్ష : ఎందుకయ్యా!

హరి : ఓయి స్వామీ! నీవు ఋషిశిష్యుడ వనుకొన్నాను. నీవు మహర్షివే. నీ సంకల్ప మిట్లు సమకాలమున భూతకోటికి విదిత మగుచున్నది.

వీర : ఏం అంటాడు, అరిచ్చంద్రయ్య?

నక్ష : ఈయన విశ్వామిత్రఋషికి ఋణపడినాడు. నీ వీయనను బానిసగా గొని ఆ ధన మీయవలయును.

వీర : దరిద్రపోణ్ణి తెచ్చావు! చరే! లేకపోతే ఋణం ఎట్టా తీరుతుంది? పో, డబ్బిచ్చిత్తాలే. ఇదిగో నండోయి! దొరగారూ! అరిచ్చంద్రమారాజా గారూ! సీసీ! నీవు నాదాచుడ వేటి, నిన్ను దొరా యేటి! ఇదిగో అరిచ్చంద్రయ్యా! ఈ కాటికి నీ వింక అతికారివి. చవం దగలెత్తే నాకు రొండుమాడ లొత్తాయి. నీకు చవంమీది గుడ్డపీలి కొత్తది. ఒక చోలెడు గింజ లొత్తవి. నాయంగా బతుకుచుమూ. నేను మాపడ్డోణ్ణి. ఎగుడు దిగు డొచ్చిందా, మెడకాయమీద తలకా యుండదేయు! పోతుండా. ఒల్లుదగ్గరెట్టుకు బతుకేం! తెలిచిందా!

హరి : చిత్తము. నన్నేలినవాడా!

వీర : సెభాస్. అదీ తరవా! పోతుండా.

హరి : వటూత్తమా! ఇంక సెలవు. సర్వఋణవిముక్తుడ నయితిని గదా!

నక్ష : అప్పుడే యెక్కడ తీరినది? ముని ఋణము తీరినది. మరి క్రొత్తఋణ మేర్పడినది కదా! వీరబాహుని సేవాఋణము. అది యీగవలయును.

హరి : స్వామీ! దీనిని నా శరీరముతో నీగెదను.

నక్ష : ఓయి శ్మశానవాసీ! నీ శరీర మెవరికి గావలయునయ్యా! పోయి మా గురువుతో జెప్పెదను.

హరి : ఏమని?

నక్ష : మన ఋణముమాత్రము తీరిన దని.

హరి : నా కర్థమగుట లేదు.

నక్ష : దరిద్రున కర్థ మెట్లగును? సంపూర్ణమే యగును. నేను పోవుచున్నాను.

హరి : ఆహా! నక్షత్రకుడు వెళ్ళినాడు. ఇది చిత్రముగా నున్నది. భార్యా పుత్రులు వెళ్ళి నని పించలేదు. ఈబ్రాహ్మణవటువు వెళ్ళినా డనిపించు చున్నది. నిజమే. అతడు చెప్పినదానిలో గొంత నిజ మున్నది. భార్యా వియోగము, శ్మశానవాసము. అందులో గాశీక్షేత్రమున. ఇది యొక శివయోగము.

మరి కాలకౌశికు డే మన్నాడు?

అకట శివుగుడి ద్రోగె నా యప్రతిష్ఠ
సాధు హృదయంబునను ద్రోగు నాప్రతిష్ఠ
చంద్రమతి యేమి యయ్యెను? జంటివాడు
లోహితుం డేమి యయ్యె నా లోహితుండు?

ఆ దూరాన నే నెఱుగని మంట యెక్కడిది? నాకు దెలియకుండ నెవరైన శవదహనము చేయుచున్నారా! ఓహో! ఎవరు వారు? ఎవరమ్మా నీవు? ఈ యర్ధరాత్రమున నిచట నేమి చేయుచుంటివి? ఇది వీరబాహుని శ్మశానవాటిక. ఆయనయాజ్ఞవినా యిచట పురుగు మెదలరాదు. కాటి సుంకము చెల్లించకుండ నిట శవము దహించరాదు. కాటి సుంకము రెండు మాడలు. నా కొక నో లెడు గింజలు. శవముపైని గుడ్డకూడ నాకే వచ్చును.

చంద్ర : అయ్యో! నేను పరమదరిద్రురాలను. వీడు నా కొడుకు. పాము కఱచి చచ్చిపోయినాడు. నే నేమి చేయుదును?

హరి : నేనుమాత్ర మేమి చేయుదును? అంత దరిద్రురా లయినచో నాకు రావలసినవి వదలుకొనెదను. మా యజమానికి పోవలసిన రెండుమాడలు చెల్లించితీరవలయును. అరే! నీకుగాదా చెప్పెదునది? లాగి వేసిన కట్టెలు మరల నంటించెద వేమి! ఇదిగో చెప్పుచున్నాను. ధర్మభంగము వలన నాకు గోపము రాగలదు.

చంద్ర : ఏమి? ధర్మభంగమువలని కోపమా! శ్మశానములో నిట్లు మాటాడువా రెవరు?

హరి : ఏమమ్మా, అంత యాశ్చర్యము! పరమశివనిలయము, సర్వధర్మచోదన భూమి యయిన శ్మశానమున ధర్మశబ్దశ్రవణ మంత యబ్బురమా!

చంద్ర : అయ్యా! కాదుకాదు. నాదే పొరపాటు. క్షమింపుము. అయ్యా! ఈ బిడ్డతండ్రి యొకనాడు మహారాజు. నే డిట్లయినాడు.

హరి : ఒకనాడు మహారాజు. నే డిట్లయినాడు.

చంద్ర : రెండు మాడలు తేలేను.

హరి : పోయి నీభర్త నడిగి తెమ్ము.

చంద్ర : అయ్యా! నా భర్త ఋణవిముక్తికై న న్నమ్మినాడు.

హరి : ఎవరికి?

చంద్ర : ఒకబ్రాహ్మణునకు.

హరి : ఆ బ్రాహ్మణు నడిగి తెమ్ము.

చంద్ర : ఆయన యీయడు.

హరి : పాలించుచున్న బ్రాహ్మణు డీయడు. పాలింపని కాటికాయకు డిచ్చును. పో.

చంద్ర : అయ్యో! అంత కఠినత యేలనయ్యా! కొంచెమయిన దయ లేదా!

హరి : నాకా దయలేదు? ధర్మమునకు దయ లేదు.

చంద్ర : ఇది రెండవమాట.

హరి : నీ వే మనుమానపడుచున్నావో నాకు దెలియును.

చంద్ర : ఏ మనుమానపడుచున్నాను?

హరి : అనుమానము కాదు. నిజమే.

చంద్ర : ఓయి స్వామీ! కడుపున పుట్టిన బిడ్డమీద దయలేదా!

హరి : చంద్రమతీ! కొంచెము సేపు మాటాడించకుము.

మోహాటవి జరించు ముగుదల కుచగిరి
నెత్తమ్ములందున నృత్యమాడు
ఆశామహాశాఖలందు భ్రమించు బు
త్రు లటన్న ఫలముల రుచి మెలంగు
నోయి కపాలి! భిక్షూ! యీ మనస్సన్న
చపలాతిచపలంబు కపిపరంబు
భక్తిపేటిక రజ్జుబంధంబునం గట్టి
నీ యధీనంబున నిలుపుకోవె
బాలచంద్రమఃశేఖర! పర్వతేంద్ర
దుహితృతేజఃకుటుంబి! నిర్ధూతకలుష!
పశుపతీ! పల్చు త్రెంచుక పారిపోవు
పశుల బందము లుంచి కాపాడుమయ్య!

ఏ మన్నావు? పిల్లవానిని పాము కరచినదా!

చంద్ర: అవునయ్యా! మహారాజా!

హరి: శివాజ్ఞ.

చంద్ర: మరి యిప్పు డేమి చేయుదము?

హరి: ఓసి సర్వపరిత్రదుని పెండ్లమా! వీరబాహుడు కాటి పాలకుడు. నీవును నీ కొడుకును కాపాలనములో లేరు. మీ రితరులు. ఇతరుల కొరకై నేను వీరబాహు నెట్లడుగుదును? నీవు పోయి కాలకౌశికు నడిగి రమ్ము. దయపుట్టి యిచ్చునేమో!

చంద్ర: ఈయనిచో?

హరి: ఈయనిచో నా! మనము పరమశైవులము. శైవుల కీనాటినుండి దహనము కాక ఖననమే ధర్మ మగుగాక.

చంద్ర: పోయి యడిగి వత్తును.

హరి : సరే. చంద్రమతి వెళ్ళినదా! లోహితుని శవ మిచట నున్నదా! వీడు నాలో నున్న మాయాజీవునకు కొడు కన్న భ్రాంతి కలిపించినవాడా! (నవ్వుచుండును).

రాజభ : ఓయోయి! శ్మశానములోని సంతోషీ! నేను రాజభటుడను. ఈ యాజ్ఞ వినుము.

హరి : నీవు రాజభటుడవా? నీరాజాజ్ఞతో నా కేమియు సంబంధము లేదు. నేను వినను. వినవలసిన పని లేదు. పో.

రాజభ : ఇది రాజాజ్ఞ కాదు. వీరబాహుని యాజ్ఞ.

హరి : శిరసావహించుచున్నాను. చెప్పుము. వెంటనే నిర్వహించెదను.

రాజభ : ఓయీ! ఈమె బాలఘాతకి. నగలమీది యాసచేత రాజశిశువును వధించినది. పరమ దుర్మార్గురాలు. రాజప్రాసాదమునకు కన్నము చేసి నిదురవోవుచున్న రాజశిశువు నెత్తుకొనిపోయి వాని కంఠము నులిమి చంపినది. వెంటనే – సూర్యోదయాత్పూర్వమే దీని శిరచ్ఛేదము చేయవలయు నని రాజాజ్ఞ. వీరబాహుడు నీ కీపని నియమించినాడు. ఇదిగో వధ్యురాలు. నేను పోవుచున్నాను.

హరి : ఓసి ధనాశాదూషితురాలా! రమ్ము. ఈ వధ్యశిల నధిరోహింపుము.

చంద్ర : మహారాజా!

హరి : ఎవరు? చంద్రమతీ!

చంద్ర : అవును స్వామీ! నేనే. పిల్లవానిని పాము కరచినచో నెవరిని నిందింతుము? ఇట్లన్యాయముగ రాజశిశువధ నామీద బెట్టుట కెవరినో నిందించుటకు?

హరి : ప్రేయురాలా! నిజమే. ఇది సవ్యాజముగ గనిపించును. కాలకౌశికు నింటికి బోనేలేదా?

చంద్ర : లేదు. దారిలోనే యిది జరిగినది, రాజభటులు నన్ను పట్టుకొన్నారు. రాజువద్దకు నను గొంపోవుటయు, మరణశిక్షయు నిమేషములో జరిగినది.

హరి : చంద్రమతీ! నీవు కాశీరాజదుహితవు. నిన్ను రాజు గుర్తుపట్ట లేదా?

చంద్ర : ఔను ప్రభూ! కాశికాపురి తన కూతు నన్నును, అల్లుని నిన్నును బట్టపగలే గుర్తుపట్టలేదు. అర్ధరాత్రమున రాజు తన సోదరిని గుర్తుపట్టునా?

హరి : నీవు చెప్పికొనలేదా!

చంద్ర : స్వామీ! నీతో నున్న యాంతరవస్తువునకు జీవలక్షణము పోయి శోక జ్ఞానము లోపించినది.

హరి : నిజమే. ఎట్లు చెప్పికొందువు?

చంద్ర : మహారాజా! సూర్యోదయము కాకముందు నా శిరశ్ఛేదము చేయవలయును. లేనిచో ధర్మభంగ మగును.

హరి : నిజమే. కాని యిది చూచితివా! ఇది యెప్పటి కప్పుడే క్రొత్తసుమా! పుత్రేషణము గెలుచుటకు భగవంతుడు సర్పరూపమున సాయము చేసినాడు. దారేషణను గెలుచుటకు సాధ్యము కాని స్థితి కల్పించినాడు. అట్లే నిన్ను రాజభటులే వధింపకపోయిరా! నేను చేతులారా వధింపవలయునా? నిజమే. నా గెలుపు సంపూర్ణమైనది కావలయును. సత్యాజ మేల గావలయును?

ఇట్లు రమ్ము. ఈ వధ్యశిల నధిరోహింపుము.

ఈ దుఃఖమే మోహము. అవిముక్తభూమియందు మరణించిన నా భార్యాపుత్రులకు శివసాయుజ్యము కలుగును.

విచారించవలసిన పనిలేదు.

ఇదిగో నాకత్తిచివర దారేషణనిరాసము లగ్నమై యున్నది.

శివ శివ శంభో మహాదేవ!

విశ్వా : రాజా! ఆగు మాగుము.

హరి : ఎవరు నీవు?

విశ్వా : నేను విశ్వామిత్రమహర్షిని. శునశ్శేఫుని జీవరక్ష చేసినవాడను. త్రిశంకునికొరకు రెండవ స్వర్గము నిర్మించినవాడను. సర్వదేవతలను తిరస్కరించి బ్రహ్మర్షి నైనవాడను.

హరి : ప్రభూ! తూరుపురేక లాడుచున్నవి. కొంచెము తొలగి నిలువుడు. ఈ ధర్మనిర్వహణము సూర్యోదయాత్పూర్వము చేయదగినది. తరువాత భవత్సపర్యాబుద్ధి నగుదును.

విశ్వా : ఏ ధర్మనిర్వహణము? భార్యను వధించుటయా!

హరి : స్వామీ! భార్య యెవరు? భర్త యెవరు? ఇది యొక పెద్దభ్రాంతి.

ఈశరీరంబు లే దను మెట్టు లుండు
నవుడు జీవుడు వాని భార్య యది యెవరు?
కాదు కెవరు? తత్స్వరూపమే కడిది; దేహ
గత పరిభ్రాంతికల్పితాగత మఖిలము.

విశ్వా : సర్వధర్మము శరీరస్థితికల్పితము. నీవు ధర్మ మని చేవులాడుచున్నావు గదా!

హరి : అట్లు లేదు బ్రహ్మర్షీ. సర్వము శివాధీనము. శివకైంకర్యము. శివ తేజో విక్రియావిశేషమే. నేను చేయునది లేదను నిశ్చయమే యున్నది.

విశ్వా : మరి యప్పుడు భార్యను జంపనక్కరలేదు. ధర్మము చేయుచున్నాననుటయు భ్రాంతియే; నీకొడుకును బ్రతికింతును. నీరాజ్యము నీ కిత్తును. లేచిరా. అంతటి రాజ్యభోగ మేల వదలికొందువు? నా మాతంగ్రదను మాతంగకన్యలను వివాహమాడుము. భ్రాంతియని తెలిసి చరించుటలో భ్రాంతి లేదుగదా.

హరి : ఇది యంతయు సౌఖ్యము కావలయు ననుకొనినగదా కావలసినది? ఈ సౌఖ్యము భ్రాంతిజన్య మని తెలిసినపుడు సౌఖ్యమే లేదు. మరి దేనికొరకు మీ సంతే?

విశ్వా : నీ వరిషడ్వర్గము గెలిచితివి. ఈషణత్రయమును గెలిచితివి. నీవు జీవన్ముక్తుడవు.

హరి : స్వామీ! నా కది యేమియు దెలియదు. నేనా! నేను లేనే. ఓహో! యిది యేమి. ఇది శ్మశానము కాదు. కైలాసమా? ఈ వధ్యశిల నందిమూపురమా ? ఈ చంద్రమతి పార్వతీదేవియా ? ఈ లోహితుడు విఘ్నేశ్వరుడా ?

విశ్వా : నీవు శివైకదేశమవు.

హరి :

శివోఽహం శివోఽహం శివోఽహం శివోఽహం
సతోఽహం సతోఽహం గతోఽహం స్థితోఽహమ్
యదా భ్రాంతిమచ్చేతసాఽహం విధూతః
తదా జీవ ఏవాఽహ మద్యాభవోఽహమ్



## ప్రవేశము : హరిశ్చంద్రుడు

హరి : ఓయి ప్రభూ! వరుణమహారాజా! ఈ హరిశ్చంద్రుడు నీకు పరమ భక్తుడు. అనేక యాగములు చేసి నిన్ను సంతోషింపజేసినవాడు.

(ఉరుముల ధ్వని)

హరి : నాకు సంతానము లేదు. పుత్రులు లేని వారికి గతులు లే వందురు. అసలు సంతానమే కలుగకుండుటకంటె కలిగి నశించినను మేలేకదా!

(ఉరుముల ధ్వని)

హరి : వేదమునందు స్తోత్రము చేయబడిన యెల్లదేవతలలో నీవే యధికుడవు. నీవే శివుడవు. నీవే విష్ణువవు. ఆదిత్యుడవు నీవు. ఇంద్రమిత్ర నీవు. కుబేరుడవు నీవు. యమధర్మరాజువు నీవు. అపాంనపాద్దేవతలు నీవు. అశ్వినీదేవతలు నీవు. మెత్తని లేత పారిజాతపు మొగ్గల కడుపులోని కమ్మని కాంతుల కన్నతల్లి యుషోదేవత నీ జాలికనులలోని తలతల అరువు తెచ్చుకొన్న తేజోలేశము.

(ఉరుములు)

హరి : ఓహో! వరుణమహారాజా! ఉరుములు, మేఘములు, సముద్రములు నీ ప్రళయరూపము. నదులు, సరస్సులు, జలపాతములు నీ సౌమ్య రూపము. శరత్కాలమున తెల్లటి వస్త్రము ధరించి పాలరాతి మెరుగులతో మహారాజసౌధమువలె నొప్పారెడి నీ సౌమ్యమూర్తి ప్రసాదింపుము.

(జలము ప్రవహించు ధ్వని, జలపాతధ్వని)

హరి : ప్రసాదము. ప్రసాదము. కొండకొమ్ముకుండి జలజల రాలు నీమూర్తి మణులపుప్పొడి పళ్ళికలతో నమస్కరించినట్లున్నది. అప్సరః స్త్రీల తెలి వలిపపుచీర లారబెట్టినట్లున్నది. ప్రభూ! నాకు పుత్రసంతానము లేదు.

సంతానము లేదని నాకు దిగులు లేదు. నిన్ను సర్వదా యజ్ఞముల చేత సంతోషపెట్టు నాతరువాత నిన్నెవరయ్యా యాగాగ్రిక్రతువుల చేత సంతోషపెట్టువారు?

(జలపాతధ్వని)

హరి : వరుణమహారాజా! దయచూడుము. నీ యాగపశువువంటివానిని నాకొక పుత్రుని ప్రసాదింపుము.

వరుణుడు : ఓయీ! హరిశ్చంద్రా! నీ వన్నట్లే.

హరి : ఏమిఏమి! సృష్టిప్రథమమూర్తి కలశదేరి నాయందు ప్రసన్నుడైనాడు. ఓహో! నాకు పుత్రసంతానము కలుగునా! అనంతాకాశమున పట్టి యావిరి మూటకట్టి కుదుపలుకట్టి మొత్తని జలాకృతి తాల్చు స్వామికి పూర్వపుణ్యముల చేత హరిశ్చంద్రుని రక్తబిందువులు కదలించి సుకుమార శిశుశరీరము కలిపించుశక్తి క్రొత్తదేమి?

వరు : (జలములోనుండి మాటాడుచున్నట్లు వినిపించును) ఓయీ! నీకు కుమారుడు కలుగును. కాని వానిని నాకు యజ్ఞపశువుగా నీయవలయును.

హరి : అట్లే యొసగుదునయ్యా! మహారాజా! ఈ శరీరములు నీవి. నీ శరీరములు నీ కొసగుటలో నాశ్చర్యమే మున్నది?

వరు : అవునోయి! మావి మాకిచ్చుట మడిమాన్యము లిచ్చుట యందురు. ఈషణత్రయములో పుత్రేషణము చాల చెడ్డది. పుత్రప్రేమ చంపుకో రానిది.

హరి : నాకు కర్మయందున్నంతటి యనురాగము వేర దేనియందు లేదు. పుత్రసంతానము నేను వాంఛించినది మోహము పొందుటకు గాదు. పున్నామనరకమునుండి విముక్తుడ నగుటకు.

వరు : సరే! కొడుకు నడుగుటకు వచ్చెదను.

(చక్రము గిర్రున తిరిగిన ధ్వని)

( పాట )

పైడి కత్తి పూనీ – బిరానా
పాపబొడ్డు కోసి.
బొరుకాడ జేసీ – తలంచీ
పేరు పెట్టకుండా !
అబ్బురంపు బిడ్డా – జనించే
అవనిపాలమణికీ.

*                    *                    *

(జలపాత ధ్వని)

వరు : హరిశ్చంద్రా ! పుత్రోదయవేళ నీకు నా శుభాశంసనములు.

హరి ; దేవతాశిరోమణీ ! ఇది యంతయు నీ దయావిశేషము.

వరు : నీ కింక పున్నామనరకభయము లేదు.

హరి : స్వామీ ! నీదయవలన లేదు.

వరు : ఇంక నీకుమారుని నాకిచ్చివేయుము. నేను యాగపశువుగా వరించితిని.

హరి : దైవమా ! ఇదియేమయ్యా ! ఈ పసికందును కొనిపోయి నీ వేమి చేసెదవు ? ఈశిశువు రూప మింకను కట్టెనో లేదో యనామకద్రవ్యము. ఇట్టి జోత్తుపాపలమీద వెన్నెమ్మపురుగు లాసపడును. బాలగ్రహము లాసపడును. దేవతాశిఖామణివి నీవా యిది వాంఛించుట ? కాదు. "నీవు నాకు వాని నిచ్చితివి. నా కిచ్చివేయుము. తీసికొనిపోయి నేనే పెంచుకొందు"నందువా ! తీసికొనిపొమ్ము. కొనిపోయి యెక్కడ పెంచెదవు ? దాది యెవరు ? ఉయ్యాలమంచ మెచ్చటని ? పాలిచ్చు తల్లియేమి ? సర్వవైదికకర్మాధీశ్వరుడవు నీ వీపసిపాపను బశువుగా జేసికొందువా ?

దరుల జలదాలలో గిరీంద్రముల తెరల
దొరలు జలధారలలో బెంచుదువో కుమారు
స్వామి ! యీ పసిపాప యీ చలికి నాగి
పోవు బిగిసిన చలిమిడిముద్దవోలె.

వరు : నిజమే. పసివానిని నే నెక్కడ పెంచగలను? మీ యింటిలోనే నే
యుండనిమ్ము. పురిటిపాపను దీసికొనిపోయి నేను యజ్ఞపశువుగా నెట్లు
చేయుదును ?

హరి : పురిటిపాప యేమి, యజ్ఞపశు వేమి! వచ్చిన ఋత్విక్కులైన నెట్లు
పట్టుదురు! యూపమున నెట్లు బిగింతురు!

వరు : తెలిసినది. తెలిసినది. మరల వత్తును లే. ఇప్పుడు తీసికొనిపోయి వీని
కాముని మెచ్చుటనుండి తెత్తును?

హరి : అవును. ప్రభూ! నే నడిగే మనవి చేసినది.

వరు : నేను మరల వత్తు నన్నానుగా నీ వింక నేమియు చెప్పనక్కర లేదు.

హరి : సెలవు తీసికొందును.

*  *  *

(సన్నాయి పాట)

(జలపాత ధ్వని)

వరు : హరిశ్చంద్రా! ఏమి మీ యింట నుత్సవములు చేయుచున్నారు!

హరి : స్వామీ! వరుణదేవా! నా కుమారునకు నామకరణోత్సవము చేయు
చున్నాము.

వరు : ఏమని పేరు పెట్టితివి!

హరి : రోహితు డని.

వరు : మరి యిప్పటికి నీ కొడుకునకు నామకరణము చేస్తివి.

హరి : ప్రభూ! నీదయవలన,

వరు : ఇప్పుడైన నీ కుమారుని నా కిచ్చి వేయుదువా ?

హరి : ఇరువదిదినాలక్రింద బురిటికందు. నేడు నూనెకందు. తీసికొనిపోయి
యేమిం చేయుదువు ?

"దరుల జలదాలలో......చలిమిడి ముద్దనోలె"

వరు : నిజమే. పసివానిని దీసికొనిపోయి నే నెక్కడ దాచగలను? మీ యింటిలోననే యుండనిమ్ము. నూనెకందును తీసికొనిపోయి నేను యజ్ఞపశువుగా నెట్లు చేయుదును?

హరి : నూనెకం డేమి, యజ్ఞపశు వేమి! వచ్చిన బుత్విక్కులైన నెట్లు పట్టుదురు? యూపమున కెట్లు బిగింతురు?

వరు : మరి యెప్పుడు రమ్మందువు?

హరి : అనుపనీతుడు యజ్ఞపశుత్వమున కర్హుడు కాడు. వానికి ద్విజత్వము లేదు. ద్విజుడు గాని నరపశువు యజ్ఞీయము కాదు. ఉపనయన మయినతరువాత వచ్చుట మంచి దనుకొందును.

వరు : చాలదూరము పెట్టితివే!

హరి : మీరే చూడుడు. ఉపనయనము చేతనే కదా కర్మార్హు డగుచున్నాడు. స్వామీ! నిన్నుగూర్చిన యాగము కర్మమార్గమున నున్నతోన్నతముగా నున్నది. అట్టి నీ యాగమున గర్మకు యోగ్యతలేని వాని ననుపనీతుని పశువుగా జేయుటయా!

వరు : బాగుగా జెప్పితివి!

హరి : వరుణదేవా! నీవంతవర కాగినచో నీకా - సహస్రమైన పశువు లభించును. నాకా - ముద్దుముచ్చటలు తీరును. పసివాని యాటపాటలు చూచి యానందించుటయు గలుగును. నెలపుట్టిలోననే చనిపోయిన పసివానినిగూర్చి తొమ్మిదినెలలు మోసిన తల్లికి దుఃఖముండును గాని తండ్రి కుండదు. దేవతాశిరోమణీ! జగమునందలి సర్వస్నేహము పరిచయమువలన నేర్పడును. కొన్ని సంవత్సరములు పెరిగినగాని తండ్రికి గొడుకు కొడుకు కనిపించడు. పెరిగిన బిడ్డను నీకిచ్చుచో నాకు గొడుకు నిచ్చితి ననిపించును. ఈ పసిగ్రుడ్డును నీవు తీసికొనిపోయినచో నేను చేసిన వాగ్దానము తీర్చినట్లే యుండదు. ఇది నే నిచ్చినట్లు కాదు. నీవు పుచ్చుకొన్నట్లు కాదు.

వరు : బాగుగా చెప్పితివోయి రాజా! బాగుగా చెప్పితివి. మరి యెప్పుడు రమ్మందువు?

హరి : క్షత్రియులకు పదియారు యేండ్లు నుపనయనము చేయవలయును. తరువాత దయచేయుడు.

వరు : మరి యీలోపుగా నీకొడుకునుగూర్చిన సర్వజాగ్రత్తయు నేనే తీసికొందును. నీ పూరకే నీ ముద్దుముచ్చటలను తీర్చుకొనుచుండుము.

హరి : నీదయవలన నెందుకు తీర్చికొను వరుణ దేవా!

అరబోసిన బోసినవ్వుల – యచ్చవెన్నెలరాశిలో
కోరి వెన్నెల వత్తు లాడనో – కూర్మిముత్తులు దింపులై
కూరుకైన తొడమీద నెక్కిన – చుంచు దువ్వుచు నాయనా!
రార బంగరుతండ్రి! యంచును – రాణ ముద్దుల నాడనో!

వరు : అవు నవును. అంతయినపుడుగాని నీకు గొడు కనిపించదు. నీ వ్రాస్టాన ఫలము రాదు.

హరి : చిత్తము. సర్వదేవతామకుటమణికిరీటఘగద్ఘగితపాదాంభోజాతులకు దేవరకు దెలియని దే మున్నది? మీ చిత్తము, నాభాగ్యము.

వరు : మరి మేము పోయివత్తుము.

హరి : నిత్యసేవకుడను.

*   *   *

(చక్రము తిరిగిన ధ్వని)

( గాయత్రీమంత్రరావము )

హరి : బిడ్డా! లోహితా!

లోహి : చిత్తము, నాయనగారూ!

హరి : నీ విప్పుడు కర్మకు యోగ్యుడ వయితివి.

లోహి : అవును, కర్మయోగ్యమయిన స్థితి నే నిప్పుడు పొందితిని, మహారాజా! నీవలెనే నేను ననేకయాగములు చేసి దేవతలను సంతోషపెట్టెదను.

హరి : దేవతల నొక్క యాగములు చేసియే సంతోషపెట్టవలెనుగలేదు. వారిని పలువిధముల సంతోషపెట్టవచ్చును.

రోహి : చిత్రము, నాయనగారూ! ఏవిధముగా వారు సంతోషింతురో ఆవిధముగానే చేయవచ్చును.

హరి : నాయనా! దేవతలు అనుకూలముగా వర్తించనిచో వారు కోపింతురు.

రోహి : తపము చేసెదను. దానములు చేసెదను.

హరి : దాన మనేకవిధములు.

రోహి : తన్ను మించి దానము చేయుట యాత్మఘాతము. అది కాని సర్వదానము చేసెదను.

హరి : అయ్యో!

రోహి : ఏమి నాయనగారూ! అట్లయితిరి?

హరి : ఏమియును లేదయ్యా! నీవు పోయి నీ కార్యకలాపమును దీర్చుకొమ్ము.

రోహి : చిత్రము.

(ఉరుములు, మెరుపులు, వాన)

హరి : ఉరుము వినుచును భయపడుచుంటి నేను
పిడుగుగా వచ్చి తలమీద బడు నటంచు
నోరులేనట్టి పశువో మనుష్యు డనగ
వాని యనుమతి లేక యీ పశుత నొట్లు?

వాడా! చిత్రమైన మనఃప్రవృత్తి కలవాడుగా నెరిగినాడు. వరుణదేవుడనగా జండమూర్తి.

వరు : రాజా! యాగపశుత్వమున కర్హుడైన కొడుకుచేత వర్ధిల్లుచున్నావు.

హరి : వరుణమహారాజా! దయచేయుము, దయచేయుము.

అఖిలజలమయాకృతి వైనయట్టి నీకు
నర్ఘ్య మేరీతి సమకూర్తునయ్య నీకు!
నందు గల బిందు లే వనునట్టి నీకు
స్వాగత మ్మెట్లు చెప్పుదునయ్య నీకు!

వరు : ఏమోయి రాజా! అట్లు వెదకుచున్నావు? నీకుమారుడు సేమముగా నున్నాడా? క్షాత్రశ్రీముఖుడుగా నుండెనా?

హరి : వరుణదేవా ! నిరామయుడుగా నున్నాను.

వరు : ఎందుకు వెనకకుచుంటివి ? మరియు నేడైన సాకు చెప్పవలయు నని తలచుచుంటివా !

హరి : అగిదేమి స్వామీ ! పూర్వము సాకులు చెప్పి నిన్నలయించితినా !

వరు : పురుటిలో పిల్లవానిని పురుటికం దంటివి. పెలపురుటివానిని సూతకం దంటివి. మరి పెరిగినవానిని అనుపనీతు డంటివి.

హరి : అది యేమిమాట దేవతాసార్వభౌమా ! నిన్ను సంగీకరించితిని. నీ వంగీకరించుట నా మాటలలోని ధర్మమును నీ వెఱిగితి వనుకొంటిని. నీవు దేవతామూర్తివి. మనుష్యునివలె ననుచుంటివి. మా మనుష్యు లిట్లేలే.

వరు : ఎట్లేమి ?

హరి : భవిష్యత్తున లాభాశతో నంగీకరింతురు. ఆ లాభము తరువాత లభించనిచో నెవరో తమ్ము మోసగించె నందురు. భవిష్యత్తులో తమ కెక్కువ లాభము కలుగునని వారు పడ్డ యాశ న్యాయమే. ఇతరు లట్లు చెప్పుట యన్యాయము.

వరు : ఓంరాజా ! మీ మనుష్యజాతి మిక్కిలి తెలివితేటలు కలది. నీవు చూచుము. అప్పుడది ధర్మము చెప్పినట్లు లున్నది ఇప్పుడిది న్యాయము చెప్పినటు లున్నది ?

హరి : అంతదాక యొందుకు ? నే నప్పుడే యబద్ధమాడినట్లు చెప్పినావ గొందఱు చెప్పగలుగుదురు. కొందఱి నొప్పించగలుగుదురు.

వరు : అది యెట్లు సాధ్యము ?

హరి : స్వామీ ! అన్నియు సాధ్యమే. స్వార్థము కొలంది సర్వవాదములు సాధ్యము. ఈ హరిశ్చంద్రుడు తన కొడుకును నాకు యజ్ఞపశువుగా నిత్తునన్నాడు. ఇచ్చునో యీయడో అని భయము. కాలము గడచిన కొలది ననుమాన మెక్కువ. ఈ యనుమానములో నేన కేది చెప్పినను అడుకును.

వరు : సరే ! నీవు సాకు చెప్పలేవు. నీ కొడుకును నా కిమ్ము.

హరి : మరియు ధర్మము చెప్పెదను. మీరు నాయందు దోసము చెప్పరాదు.

వరు : చెప్పము.

హరి : యజ్ఞపశువుగా బశ్వాదులను వధించుటలోనను, మానవులను వధించుట లోనను భేద మున్నది.

వరు : ఏమి టది?

హరి : పశ్వాదులకు జ్ఞానము లేదు. మానవులకు జ్ఞాన మున్నది. అంగీకారాదు లున్నవి.

వరు : అడిగినచో బశువులు నంగీకరింపవు. అందుకనియే యని పెనగులాడును.

హరి : ఆ పెనగులాట జంతులక్షణమైన భయము. అంగీకారము మనోలక్షణము. ఆ యంగీకారము లేనిచో పశుప్రసవ బశుత్వము పట్టదు. యాగము వృథా యగును.

వరు : నీకొడు కంగీకరింప డంటివా! మరి చిన్నప్పుడే పశువును జేయక పోయితివా!

హరి : చిన్నప్పుడు చేసినచో యజ్ఞఫలము లేదు. ఇప్పు డంగీకృతి లేకుండ జేసినను నట్లే.

వరు : మరి యంగీకరించునేమో మాటాడితివా!

హరి : మాటాడలేదు.

వరు : ఎందుకు మాటాడలేదు?

హరి : వరుణమహారాజా! వాని మనోధర్మము, వాని చిత్తవృత్తి, వాని శరీరము సర్వము నీవశమునం దుంచుకొంటివి. వాని యూహ్యతివిశేషమును మాత్రము చూచి నేను పుత్రమోహము పొందుచుంటిని. వాని మనస్సు దేవతాత్వ మంటినట్లు ప్రభువై యున్నది. చిన్నినాటినుండి నా యదుపులో నున్నచో యజ్ఞాయత్తమై యుండెడిది.

వరు : పూర్వమే నీవు నాతో చెప్పినచో నేను వాని సర్వము నీ యధీనమం దుంచెడివాడనుగదా!

హరి : అప్పుడు నాకుమాత్ర మేమి తెలియును ?

వరు : ఇప్పుడు తెలిసినదా ?

హరి : అనుమానముగా నున్నది. కదలించిచూచితిని. అనుకూలముగా నున్నట్లు లేదు.

వరు : నా సంగతి చెప్పితివా ?

హరి : చెప్పలేదు. పరోక్షముగా మాటాడితిని. ఏదోగా మాటాడినాడు.

వరు : ప్రత్యక్షముగా మాటాడిచూడుము. వాడంగీకరించినను అంగీకరించక పోయినను నీవాగ్దానము నీవు చెల్లించితీరవలయును.

హరి : అంగీకరించకున్నచో నెట్లు? బలవంతముగా వధించు మందువా ? అది వధ యగునుగాని యజ్ఞము కాదే?

వరు : ఓయీ! ఈ మాటలు తీసి యావలబెట్టుము. అంతే. మరి యిందు కనియా! అప్పు డట్లు చెప్పితివి ? అనుకనీదు దని, యేమేమోయేమోనని.

హరి : దేవతాసార్వభౌమా! నీ కంతకోపమైనచో నేనే నరుదును యజ్ఞపశువును. తీసికొమ్ము.

వరు : నీ వగుదువా! నీ వెవరికి గావలయును? బహుదేవతాకమైన యజ్ఞము లీ వన్ని చేసితివి ? ఇంద్రునిగూర్చి చేసితివి. యమునిగూర్చి చేసితివి. కుబేరునిగూర్చి చేసితివి. సర్వదేవతలయందు వ్యభిచరించిన మనోవృత్తి తోడి నీవు నా కెందుకు ? నీ కొడుకో పసివాడు. అన్యదేవతాబుద్ధి కాడు. మున్నె యితరదైవతమును పూజించి యెఱుగడు. అచ్ఛమైన పాలవంటివాడు. వాడు కావలయును.

హరి : అడిగి చూచెదను.

వరు : అది పనికిరాదు. ఒప్పించితీరవలయును.

హరి : అత డొప్పుకొననిచో ?

వరు : ఒప్పుకొననిచో నీ వనుభవించవలయును. నిన్ను అబద్ధమాడినవానినిగా నేను జెప్పెదను. ఎవరో వాదకుశలులు చెప్పుట యెందులకు ?

హరి : ప్రభూ ! మనుజులు వాదకాశలము వెలయింతురు. ఐహికఫలము వాంఛించి వెలయింతురు. పాపము పొందుదురు. అట్టి పాపమార్గమున దేవత లేల పోవలయును ?

వరు : పాపపుణ్యము లట్లుంచుము. స్వార్థము దేవతలకును గలదు. నీచేత వాగ్దానము చేయబడిన యజ్ఞపశువునుండి కితురింపబడిన నేను కోపము పొందుటలో దప్పేమి కలదు ?

హరి : లేదు మహారాజా ! కాని పిల్లవాడు పెద్దవా డైనాడు. వా డొప్పుకొనవలయునుగదా ?

వరు : పెద్దవా డైనతరువాత నొప్పుకొనడేమో యని నీవు ముందే యాలోచించవలసినది.

హరి : మనవి చేసితినిగదా ! నా కాయూహ రాలేదు. తమకును రాలేదు. నాయందే దోష మారోపించుచుంటిరి.

వరు : ఓయీ హరిశ్చంద్రుడా ! గడుసువచనము మాకును దెలియును. తెలివి తేటలనుబట్టి లక్ష వాదించవచ్చును. కాని పరమార్థమున నష్టపడినది నేను.

హరి : ప్రభూ ! నే నతనిని గట్టిగా నడిగిచూచెదను. "నాయనా ! ఇది దేవతలతో బని. నీ వంగీకరింపనిచో నా నెత్తిమీదికి వచ్చు" నని చెప్పెదను.

వరు : వట్టి నెత్తిమీదికి వచ్చుట కాదు.

హరి : స్వామీ ! వరుణదేవా ! మీ కోపము నే నెఱుగనా !

వరు : ఓయీ ! ఈ వినయపుమాటలు నాకు బనికిరావు. తీసికొనివచ్చి కొడుకు నిచ్చినచో నిమ్ము. లేనిచో నీ జీవితాంతము జలోదరవ్యాధిచే యమయాతన ననుభవించెదవు.

హరి : ప్రభూ ! వానిని గనుగొందు నని చెప్పుచుంటినిగదా !

వరు : నీవు చెప్ప నక్కరలేదు. నేను పోవుచుంటిని. రే పీపాటికి వచ్చెదను. కొడుకు నిచ్చెదవా సరి ! లేనిచో...

(ఉరుముల ధ్వని)

హరి : ఓయి వరుణదేవా ! వెడలిపోయితివా ! జలోదరవ్యాధి యేమిటయ్యా! ప్రభూ ! నా కడుపులో జలజంతువులు విహరించునా ! నదులు ప్రవహింపజేయునవా ! సముద్రతరంగములు ఘోషింపించునా ! కానీ, కొడుకు నడిగిచూచెదను. వాడు నా కన్నపుత్రుడుకదా నేను దిగులుపడ వలసినది. పిల్లవానిని పిలిపింతును. ఏవరురా అక్కడ !

సేవ : ప్రభూ ! చిత్తము.

హరి : ఎవరు నీవు ?

సేవ : క్రొత్తగా వచ్చిన సేవకుడను.

హరి : క్రొత్తగా వచ్చితివా! ఎవరు రమ్మనిరి ? ఇచ్చట నెవ రుండరు మరి ? ప్రాతవా డేమయ్యెను ? సరే ! మా రోహితుని నేను రమ్మనుచుంటి నని చెప్పుము. నే నతనితల్లియంతఃపురమున నుందును. అక్కడకు రమ్మనుము. తల్లిదగ్గర నుండగా నతడు నామాట కాదన డనుకొందును.

సేవ : మహారాజా ! కొడుకు యాగపశు వగుట తల్లి యంగీకరించునా ?

హరి : ఈ కథ నీ కెట్లు తెలియును ?

సేవ : వరుణుడు మీతో మాటాడుచుండ విన్నాను.

హరి : ఆయన వరుణు డని నీ కెట్లు తెలియును ?

సేవ : మహారాజా ! ఈ కథ ప్రపంచ మంతటను దెలియును.

హరి : ఇదివర కున్న సేవకుడు నీయంత తెలివిగలవాడు కాడు. నీవలె నింత నిర్భయముగా మాటాడువాడు కాడు.

సేవ : మహారాజా ! క్షమింపుడు.

హరి : క్షమించుట కేమి గాని, తల్లి యంగీకరింప దందువా ?

సేవ : కన్నకడుపుగదా !

హరి : అది కాదోయి ! వరుణదేవునకు బిడ్డ నిత్తు నన్న సంగతి యామెకును దెలియునుగదా !

సేవ : తమకుమాత్రము తెలియదా !

హరి : అనగా ?

సేవ : నాకు భార్య యున్నది. దాని పేరు తేజోవతి. నే నన్నానుగదా— "ఓసీ తేజోవతీ! నీవు పోయి యింద్రుని కోర్కె తీర్చిర"మ్మని. ఆమె నిరాకరించినది. నాకు గొడుకున్నాడు. వాని పేరు దీప్తమతి. నే నన్నాను గదా—"ఓయి దీప్తమతీ! నీవు పోయి యింద్రయాగమున బశువవు క"మ్మని. వా "డిది యేమయ్యా! నన్ను బోయి చావమందువు. నే నేమి మేకనా! గొఱ్ఱెనా! నాకు జ్ఞాన మున్నది. సదసద్వివేక మున్నది. ఇష్టానిష్టము లున్నవి. కత్తి మెడమీద బెట్టినచో నాకును నొప్పి కలుగును. నేను పో"నని యన్నాడు. భర్తకు భార్యమీదను, దండ్రికి గొడుకు మీదను యజమానికి దన యాస్తిమీద గల యధికారమును, స్వామ్యమును గలదా, లేదా యని నాకు గల సందేహము.

రోహి : వండుకొను పాత్ర, పండుకొను మంచము నిచ్చినట్లు భార్యను, గొడుకు నిత్తురా!

సేవ : ఈయక తప్పని సరియయినచో?

రోహి : ఆ తప్పనిసరి యెట్లుండును?

సేవ : నాకు పుత్రసంతానము లేదు. ఇంద్రదేవతనో, వరుణదేవతనో ప్రార్థించితిని. "ప్రభువులారా! నాకు పుత్రసంతానము దయచేయు"డని. ఆ దేవతలు "ఓయీ! నీకు పుత్రసంతానము దయచేయుదుము. ఆ పుత్రుని నీవు మాకు యజ్ఞపశువుగా నీయవలయును. అట్లయినచో నీకు పుత్రు నిత్తు" మని యందురు. అప్పు డీయవలదా? అక్కర లేదా?

రోహి : అది యేమయ్యా! యజ్ఞపశువుగా దీసికొనునప్పు డస లిచ్చుట యెందులకు?

సేవ : ఎందులకో మీ నాయనగారి నడుగవలయును. వరుణదేవు నడుగవలయును.

రోహి : నీకొడుకు నింద్రున కీయవలయుట యేమి, నా తండ్రిని, వరుణుని అడుగుటయేమి?

సేవ : నాకొడుకు నే దేవతకు నీయలేను. జయంతుడు సుఖముగా నున్నాడు.

లోహి : నీ కొడుకు పేరు జయంతుడా ! ఇంద్రుని కొడుకు పేరును జయంతుడేకదా ?

సేవ : వాడే నా కుమారుడు.

లోహి : నీ వింద్రుడవా !

సేవ : అవునోయి. నే నింద్రుడను. నీ కుపకారము చేయవలయునని వచ్చితిని.

లోహి : దేవతాసార్వభౌమా ! నమస్కారము. నిన్ను ఇంతవరకు సేవకునిగా నెంచి మాటాడినందులకు క్షమించవలయును.

సేవ : అందు నీ తప్పేమియు లేదు. నేనే కోరి యిట్లు వచ్చితిని. నీస్థితి చూచి నాకు జాలివేసినది.

లోహి : మీ రను మాటలు నా కర్థమగుటలేదు. నా స్థితి కేమి? నేను బాగుగనే యున్నానే !

సేవ : బాగుగనే యున్నావు. చక్కని కన్నులు, దివ్యమైన ముఖలక్షణము, తేజస్విత, రాజలక్షణము, మంచి వివేకము. ఈడునకు మించిన తెలివితేటలు. అందుకనియే నీ వన్నచో నాకు జాలి కలిగినది.

లోహి : ఆ జాలికలుగు హేతు వేమిరో నాకు దెలియలేదు.

సేవ : నీవంటి పిల్లవాడు యజ్ఞపశువు కాబోవుచున్నా డనగా జాలివేయునా వేయదా !

లోహి : నేనా ! యజ్ఞపశువునా ! ఎవరికి ? ఎవరి యజ్ఞములో ? కర్త యెవరు ?

సేవ : అయ్యో ! కడుపున పుట్టిన బిడ్డవు. నిన్నింత యజ్ఞానములో పెంచిన తండ్రి నే మనవలయును ?

లోహి : ఏమి ప్రభూ ! నాతండ్రికి నే నన్నచో ప్రాణము. నా కాయన ద్రోహము చేయునా ?

సేవ : నీకు బసితనము. లోకము తెలియదు. ఊరివారికన్న దన కుటుంబము ప్రియమైనది. అందులో నందరికంటె భార్యాపుత్రులు ప్రియమైన

వారు. వారికంటె మనుష్యునకు దనకు దానే మహాప్రియుడైనవాడు. తన ప్రాణముమీదికి వచ్చినపుడు కొడుకునైనను దండ్రి వదలుకొనును.

రోహి : నాతండ్రి కేమి ప్రాణముమీదికి వచ్చినది ?

సేవ : వరుణుడు నిన్ను నరపశువుగా గోరినాడు. నీతండ్రి నిన్నిత్తునన్నాడు. నిన్నందులకే రమ్మని కబురంపినాడు.

రోహి : ఏమి ప్రభూ! ఈ యన్యాయము!

సేవ : అన్యాయమన్న అన్యాయమా! నిజముగా నా కేమి పట్టినది చెప్పు. ఎంత అన్యాయము కాకపోయినచో నేను వచ్చినాను? తోడిదైవము. ఆయన చేసెడి యీ యన్యాయము నాకు రుచింపలేదు. అరే! ఎన్ని జంతువులు లేవు? నరపశువే కావలసివచ్చెనా! అందులో బంగారమువంటి పిల్లవాడు నీవా! రేపు పెద్దవాడవై మహారాజవై లోకము ధర్మమార్గమున బాలింపదగినవాడవు. ఎవడో పేదబ్రాహ్మణ బాలుడైనచో నంత విచారింపదగినది కాదు.

రోహి : మరి యిప్పుడు నా కేమిగతి! నాయనగారివద్దకే పోయి యడిగెదను 'ఏమయ్యా యింత యన్యాయ'మని.

సేవ : మంచి తెలివిగలవాడవు! వెంటనే నిన్ను బట్టింది చెరలో పెట్టును. వరుణుడు వచ్చినంతనే అప్పగించును.

రోహి : మరి పారిపోదునా ?

సేవ : పారిపోవుటకుమాత్రము వీ లున్నదా! రక్షకభటు లన్నివైపుల గా వున్నారు.

రోహి : మరి రేమిగతి ? ప్రభూ! సర్వదేవతానాథుడవు. నీవు నన్ను రక్షింపలేవా! నేను నిన్నాశ్రయించితిని. నన్ను రక్షింపుము.

సేవ : నీ వాశ్రయింపనక్కరలేకుండనే నిన్ను రక్షింపవచ్చితిని. నీ విక్కడి నున్నవాడ వున్నట్లుగా నెవరికి గన్పించకుండజేసెదను. మహారణ్యములో బోయి దాగియుండుము. కాదు. నీయిచ్ఛవచ్చిన చోటికి బొమ్ము.

రోహి : ప్రభూ! అట్లే చేయుదుము.

(పులుల గర్జనలు - నక్కల కూతలు)

రోహి: నన్నీ నట్టనడియరణ్యమున వదలిపెట్టి యీ యింద్రు డెచ్చటికి వెళ్ళెను? నే నీయడవిలో నేమి తిందును? ఎట్లు నుందును?

(నాలుగు కోడికూతలు)

నాలుగుదినములు గడచినవి. తిండి లేదు, త్రిప్పలు లేదు. అయ్యో! తెలివితక్కువగా వచ్చితినే. దేవతలుకూడ మోసము చేయుదురే. వరుణునితో నింద్రునకు వైరమేమో! అతనికి నరపశువు చిక్కునని యితని కసూయ కాబోలును. తండ్రి నన్ను బట్టుకొని వరుణునకు బలియిచ్చునని యింద్రుడు చెప్పినమాట నిజమని నమ్మి మోసపోయితిని. భయ మెంత చెడ్డది. మన కేయాపద వచ్చునని యెవరో చెప్పినంతనే యిది నిజమా, అబద్ధమాయని విచారణచేయుండము. వెంటనే యజ్ఞానమున బ్రవర్తింతుము. అసలు వరుణుడు లేడు, యజ్ఞము లేదు, వాగ్దానము లేదు. ఏదియు లేకపోవచ్చును. ఇది యభూతకల్పన కావచ్చును. ఇట్టి యబద్ధములు చెప్పుటవలన నింద్రున కేమి లాభము? ఇందులో గొంత నిజ ముండవచ్చును. ఎంతవరకు నిజమో తెలిసికొనవలయును. తెలిసికొని నిజముగా నిం దాపద యున్నచో దానికి బ్రతిక్రియ చేయవలయునుగాని యిట్లు వచ్చి యడవిలో దాగియున్నందువలన నేమి ప్రయోజనము? చివర కిచ్చట తిండిలేక మాడిచావవలయును. ఇచ్చటికి మాయూరివా రెవరైన వచ్చినచో బాగుగా నుండును. ఇంటిదగ్గరివార్తలే తెలియలేదాయెను. నిన్న నెవరో యీ మార్గమున బోవుచుండగా భయపడి దాగియుంటిని. ఈసారి యెవరైన వచ్చినచో దాగియుండను. దాగికొని ప్రయోజన మేమి?

(పాట వినిపించును)

వినంచు నేనంచు నేమి యుబలాటమ్ము, తలిదండ్రు లిచ్చిన తనువు కాకుండ—

రక్తమాంసపు శరీరము లేమి నిత్యమ్ము నిజమయిన మాటన్నె నిలువ లేకుండ—

తండ్రి యిచ్చినమాట తానొసంగిన మాట నిండజూడుము నీవు రెండు కాకుండ—

ఇప్పుడు కాదని రేపని చత్తువు కాదె పారిపోలేవు మృతిపట్టుకొకుండ.

రోహి: ఏ దెవ్వడో నన్నుగూర్చియే పాడుచున్నట్లున్నది! సమీపించినాడు ఇత డెవ్వరో యడిగెదను. అయ్యా మీ దేయూరు? మీ రెవ్వరు?

బాట: నీ వెవరు? ఇంత చిన్నవయసులో నీ యడవిలో నె ట్లుంటివి?

రోహి: నీవు పాడిన పాట యెవరినిగూర్చి?

బాట: ఎవరినిగూర్చి యేమిటి? అడవిలో భయము లేకుండ పాడుకొనుచున్నాను.

రోహి: పాడుకొనుచున్నచో భయ ముండదా?

బాట: అవును. ఉండదు. ఇద్దరు ఉన్నచో భయ ముండదు. మన మొకరము, పాట యొకరు.

రోహి: పాట యింకొక మనుష్యు డన్నట్లు చెప్పుచున్నావు.

బాట: ప్రాణశక్తి శబ్దమునం దున్నంత మరియెందు కలదు? పాడుకొనుచు పోవుచుండగా శబ్దశక్తి తోడవచ్చినట్లే కదా! పాటలో మాధుర్యమున్నది. ఆ మాధుర్యశక్తులు విధురశక్తులను దూరముగా ద్రోయును.

రోహి: ఆ మాధుర్యశక్తి కనిపించదుకదా!

బాట: వినిపించునుగదా! వినిపించుటకు, గనిపించుటకు భేద మేమి? చెవులతో విందువు, కనులతో గందువు. చెవులు, కన్నులు రెండును రెం డింద్రియములే కదా! ఒకదాని గొప్ప యేమి, ఒకదాని తక్కువ యేమి?

రోహి: అయ్యా! నీ వెవ్వడవు? ఎవరైన మహర్షివా?

బాట: కాదోయి! నే నొక బ్రాహ్మణబాలుడను.

రోహి: నీపేరు?

బాట: శునశ్శేపుడు.

రోహి : నీ తలిదండ్రు లెవరు ? ఇట్లడవిలోబడి తిరుగుచుంటి వేమి ? కాదా ? మీాయి ల్లెచట నైన నిచట దగ్గరలో నున్నదా ?

బాట : ఓయీా ! నాగో డేమని చెప్పుదును ? న న్నే పులియైనను వేసికొని పోయిన బాగుండును. ఏ రాజైనను నరమేధము చేసి నన్ను పశువుగా వరించిన బాగుండును.

రోహి : (ప కాలున నవ్వును.)

బాట : ఎందు కట్లు నవ్వెదవు ?

రోహి : (ఇంకను నవ్వును.)

బాట : ఇది బాగున్నది ! నేను పోవుచున్నాను.

రోహి : కనపడక కనపడక కనబడి పోదు నందు వేమి ? రా ! రా ! నే నెందుకు నవ్వితినో చెప్పెదను.

బాట : చెప్పు మెందుకు నవ్వితివి ?

రోహి : (నవ్వుచు) కోపించకుము. నాకు న వ్వాగుటలేదు. ఏమియును లేదయ్యా ! ఇది చిత్రముగా నున్నది. ఏ మందువు? చిత్రముగా లేదా?

బాట : ఏది చిత్రముగా లేదా !

రోహి : ఏదా ? ఇది. నన్ను నా తండ్రి వరుణదేవునకు యజ్ఞపశువుగా నిచ్చెద నన్నాడు. నేను భయపడి యీా యరణ్యమునకు బారిపోయి వచ్చితిని. యజ్ఞపశు వగుటకు భయపడిన నేను, యజ్ఞపశువను గావలయు నని కోరెడి నీవు. ఇందుకు నవ్వ వచ్చినది.

బాట : నీ వెవరవు ?

రోహి : నా పేరు రోహితుడు. నేను హారిశ్చంద్రమహారాజుకుమారుడను.

బాట : విన్నానోయి విన్నాను. మీాతండ్రి వరుణదేవునకు ని న్నిత్తునని ఈయక యబద్ధమాడెనటగదా !

రోహి : ఎవ డాతలకుమాసినవా డట్లన్నది ! ఆయన యబద్ధమాడినచో నే నిట్లు పారిపోయివచ్చుట యెందులకు ? పారిపోయిన కొడుకు నాయన వరుణదేవున కె ట్లిచ్చును ?

బాట : నీవు పారిపోయి వచ్చుటచేత దండ్రి నబద్ధమాడించినవాడ వగు చున్నావు.

రోహి : నిజము తెలియని లోకము ట్లనుకొనుననియేనా నీ తాత్పర్యము ?

బాట : కాదు. తండ్రియే కొడుకు. కొడుకే తండ్రి.

రోహి : మరి నీతండ్రి యేది చెప్పిన నీ పని చేసెదవా ?

బాట : తప్పకుండ జేసెదను.

రోహి : పద. మీయాశ్రమ మెక్కడ ? మీ నాయనగారి పే రేమి ?

బాట : మానాయనగారి పేరు అజీగర్తుడు. రమ్ము. పోదము.

రోహి : సరేగాని, "అయ్యో! నన్ను ఏపులియైన వేసికొనియైన పోదని మొదలుగా విచారము వెల్లడించితి వెందులకు ? మీయింటిలో నీకు సుఖముగా లేదా ?

బాట : తొందరగా రావయ్యా! పోవుచు జెప్పెదను. మేము ముగ్గుర మన్నదమ్ములము. నేను రెండవవాడను. మాతండ్రికి మాయన్నగారిమీద, ననగా పెద్దకొడుకుమీద మిక్కిలి ప్రేమ. మా అమ్మగారికి కడసారి కొడుకుమీద అపేక్ష. మాయింటిలో నా లాలన లేదు, పాలన లేదు. వారిద్దరు మహారాజులవలె నుందురు. ఇంటిలో పనియంతయు నేనే చేయవలయును. చేసినదానికి మెప్పు లేదు. నిత్యము తిట్లు. వంట నేను చేయవలయును. ఇల్లూడ్వవలయును. అడవికి బోయి కట్టెలు, దర్భలాకులు, నన్నియు నేనే చేయవలయును. ప్రక్కలు వేయుట దగ్గరనుండి. తొందరగా నడచిరా. కానిచో నడవిలోననే ప్రొద్దు క్రుంకును.

రోహి : నేను చిన్నవాడను. నీవు పెద్దవాడవు. నీతో నడువవలదా! పైగా నాల్గునాళ్ళనుండి తిండి లేదు.

బాట : నా కేరోజునను గడుపునిండ తిండి లేదు. నీవు నాకంటె చిన్నవాడ వైనను నాకంటె తెలివిగలవాడవు. ఎట్లయినను రాచబిడ్డవుకదా! లౌకికముగా మీకున్న తెలివి మా కుండదు. చూడుము. తండ్రి వరుణు

నను యజ్ఞపశువుగా నిమ్మనని పారిపోయి వచ్చితివి. నేనో_అయింటి లోననే పడి చచ్చుచున్నాను.

రోహి : నీ వెప్పుడు పారిపోవుద మని యనుకొనలేదా!

బాట : అనుకొనుటా! అది యధర్మముగదా! అనుకొనుట యెట్లు? అనుకో గలిగినచో నదియు ధర్మమే యనిపించును.

రోహి : ఇదియా! నీకును నాకును భేదము. సరే! ఇప్పుడు మీ తండ్రి నిన్ను యజ్ఞపశువుగా బొమ్మన్నచో నీవు పోదువా?

బాట : తండ్రి పొమ్మన్నచో బోక తప్పునా?

రోహి : చావన్నచో నీకు భయము లేదా? అవునులే. అంత భయమయినచో బాడుకొందువు.

బాట : రోహితా! నీవయ సెంత?

రోహి : పదునొకండు సంవత్సరములు. నీవెందు కడుగుచున్నావో నాకు దెలియునులే.

బాట : తెలియునుగాన జెప్పుచున్నాను. ఒకటి వరుణు డంగీకరించవలయును, రెండు మానాయనగా రంగీకరింపవలయును. ఇదిగో మాయిల్లు. ఆ ముంగిట కూర్చున్నవారు మా నాయనగారే.

రోహి: అజీగర్తమహార్షీ! నమస్కారము.

అజీగ : ఏమిరా! శునశ్శేఫా! ఎచ్చటికి బోయినావు? నీ మందమతికి దోడు నీకు మరల నింటికి దారికూడ దెలిసినదా! సంధ్యావందనవు ముక్కలైనను రావు. ఇంటిలోనికి బోయి యగ్నిలో నుమికపోసి భద్రపరుపుము. ఈ కుఱ్ఱనా డెవరు? రాజకళ వెళ్ళగ్రక్కుచున్నాడు.

రోహి : అయ్యా! నేను హరిశ్చంద్ర మహారాజుగారి పుత్రకుడను. నాపేరు రోహితుడు.

అజీ : ఏమి యి ట్లడవులబడి వచ్చితివి?

రోహి : అడవులబడి రాలేదు. స్వామీ! న్యాయమైన మార్గముననే వచ్చి తిని. మా నాయనగారు వరుణదేవతాకమైన యాగము చేయుచున్నారు. వరుణుడు నరపశువు కావలెనని కోరినాడు.

అజీ : ఆకథ నేనును విన్నాను. మీ తండ్రి నాలుగుదినములనుండి జలోదర వ్యాధిచే యమయాతన పడుచున్నాడట ! మా యాశ్రమవిద్యార్థులు చెప్పిరి.

రోహి : మరి యేమిగతి ?

అజీ : తండ్రిమీద నంత ప్రేమ గలవాడవేని వెంటనే యింటికి బోయి యజ్ఞ పశువవు కమ్ము.

రోహి : ఓయయ్య ఋషిసత్తమా ! నాకు ప్రాణము మిక్కిలి తీపిగా నున్న దయ్యా !

అజీ : లోకములో నెవరికి తీపి కాదు ?

రోహి : నిజమే స్వామీ ! నాకు బోలెడంత రాజ్య మున్నది. అనంతమైన గోధన మున్నది. ఏమియు లేనివాడనైనచో నైహికసుఖ మెట్టును లేదని విరాగభావ మవలంబించెడివాడను. ఇంత సుఖము పొందగలను. మరింత సుఖము కొనగలను. వృథాగా జచ్చిపోదునా ?

అజీ : నిజమే. నీవంటి రాచబిడ్డ చనిపోవరాదు. కావలె నన్నచో బదిమంది దారిద్ర్యము తొలగించువాడు నిష్కారణముగా నేల చనిపోవలయును?

రోహి : ఆ వరుణునకు నరపశువు తప్పక కావలయునట ! ఇది కొనిడిదా? పెట్టెడిదా !

అజీ : ఏమోలే! ధనమూల మిదం జగ త్తన్నారు. ధన మిచ్చినచో నీబదు లెవరైనను పశు వగుటకు రావచ్చును.

రోహి : ఎవరు వత్తురు స్వామీ! వారియంతట వారు రారు. కాని తండ్రి యాజ్ఞబడి యేకొడుకైన రావచ్చును. ఊరకే రమ్మనుచున్నానా ? ఎంత యడిగిన నంత యిత్తును.

అజీ : ఎంత యిచ్చెదవేమి ?

రోహి : మీ రాశ యడుగుడు.

అజీ : నాకొడుకును నే నీయను.

తనకు ముగ్గురు కుమారులుండగా !

అజీ : మా యాబిడ తన కొడుకు నీయదు.

రోహి : మిగిలినవా డున్నాడుగదా!

అజీ : నరపశువు కాదగినవాడు తా నంగీకరింపక పశుత్వము సంభవిల్లదు.

రోహి : ఆయనచేత నంగీకరింపజేసికొనుట నాకు వదలిపెట్టుడు.

అజీ : అట్లు పశువైనవానికి నుత్తరలోకములు ప్రాప్తించును.

రోహి : ఐనా శాస్త్రచేతగాని యిది యేమి తక్కువవిషయమా! వేదములయందు బొగడబడిన విషయము.

అజీ : అత డొప్పుకొను నందువా?

రోహి : ఆ సంగతి మీ కెందుకు? మీ రనుమతింతురా!

అజీ : మీ రిద్దఱు గలసి వచ్చితిరి. నీతో నత డట్లు చెప్పెనా? ఇంత నిశ్చయముగా చెప్పుచున్నావు.

రోహి : ఆ! చెప్పినాడు. మీ రనుమతింతురా?

అజీ : ఏమి రాచబిడ్డవయ్యా! చమత్కారముగా నాచేత నంగీకరింపజేయుచున్నావు.

రోహి : నీ కొడుకునకు నుత్తమలోకప్రాప్తి, ఒకని ప్రాణరక్షణము చేయు నుపకారఫలము. మీరు సుఖముగా బ్రదుకవచ్చును. మీ కే మడిగెదరో యడుగుడు. ఏకవిషయమునందు మూడు దివ్యమైన ఫలితములు కనిపించుచున్నవి.

అజీ : నీ యిష్టమువచ్చినది యిమ్ము.

రోహి : ఏబది గోవుల నిచ్చెదను.

అజీ : కాదు. వందగోవు లిమ్ము.

రోహి : అట్లే. నేను శునశ్శేపుని గొనిపోయెదను. స్వామీ! మీరుకూడ యజ్ఞమునకు రావలయును.

అజీ : తప్పకుండ వచ్చెదను.

రోహి : మీ కుమారు డేడీ! ఏమయ్యా! శునశ్శేపుడా! మీ తండ్రిగారు నిన్ను నా కిచ్చిరి. పోదము రా!

శున : నీకు నన్నమ్మినారా?

రోహి : అవును.

శున : ఎంతకు ?

రోహి : వందగోవులకు.

శున : వందగోవులే! ఓయి! వెర్రి రాచకుమారుడా! చాల వెలపెట్టితివి. నేనొక్క గోవుకంటె యెక్కువ వెలచేయను. గోవు నయముకదయ్యా! హవ్యము సమకూర్చును.

రోహి : నాబదులు నిన్ను వరుణునకు యజ్ఞపశువుగా గొంటిని.

శున : సరే! నాయనగారూ! సెలవు. ఇంక మీరు తండ్రి కారు, నేను కొడుకును గాను.

అజీ : రోహితా! యజ్ఞమునకు దప్పక వత్తును.

శున : అవునయ్యా! నావంటి కొడుకువలన నేమి ప్రయోజనము? నాకు వేదము రాదు. నేను పండితుడను గాను. నావలన వంశమునకు వచ్చెడు ప్రతిష్ఠ లేదు. అన్నిటికంటె నేను తండ్రికి పెద్దకొడుకును గాను. తల్లికి చిన్నకొడుకును గాను. యజ్ఞపశువ నగుటకు నడిమికొడుకను.

రోహి : పదవయ్యా! పోదము.

శున : తండ్రి యిచ్చినతరువాత నెందుకు రాను? పారిపోయి యడవిలో దాగికొననులే. కొడుకు తండ్రిసొత్తు. తండ్రి వాని నమ్మినచో నతడు పెఱలసొత్తగును. ఇది పురాతనధర్మము. ధర్మము తెగించిపోవువాడను గాను.

అజీ : నీవు శునశ్శేపుడవేనా!

శున : అవునయ్యా! శునశ్శేపుడనే. నీ చేత - కన్నతండ్రిచేత యజ్ఞపశువుగా వందగోవుల కమ్ముడుపోయిన నీ నడిమికొడుకును శునశ్శేపుడను.

అజీ : ఆరే! ఇన్నాళ్ళు గంగిగోవవు. ఇన్నాళ్లు మూగవు. ఇన్నాళ్లు మందబుద్ధివి. ఇన్నాళ్ళు జడుడవు. ఇంత వాచాలత, యింత నిందాగర్భోక్తి యొచటినుండి వచ్చినవి?

రోహి : అది రేమయ్యా! నీ కొడుకు గొప్పకవి. గాయకుడు. ఆయన నట్లనెద రేమి?

అజీ : కవియా? గాయకుడా?

శున : పదవయ్యా! రోహితా! పోదము.

పదవయ్య మీ పురికి రోహితా!
పశువుగొని నన్ను గరుణాహితా—
శబ్దమయలోకములలోనా!
అబ్దమయ కాలమువిలీనా
కారమయి మృత్యు వయి కదలాడుచున్నయది
కారయితే శబ్దాధికార మవలంబించి
మృత్యువును గెలువగల దేమో
సత్యపథమును జూపునేమో—

రోహి : అదుగో మా తండ్రి గారు!

శున : రాజా! అబద్ధమాడితి నన్న దోషము నిన్నంటకుండుగాక!

హరి : బ్రాహ్మణవటువా! నమస్కారము. ఎవరవయ్యా నీవు?

శున : నా పేరు శునశ్శేపుడు. నాతండ్రి యజీగర్తుడను ఋషి. నీ కొడుకు తన బదులు నన్ను యజ్ఞపశువుగా విలిచి తెచ్చినాడు.

హరి : నీ కంగీకారమేనా?

శున : 'నా కంగీకారమేనా' కాదు. 'వరుణున కంగీకార మేనా' యని.

హరి : కావచ్చును. నీవు వటువవు. అన్యదేవతాకమైన దేయజ్ఞమును నీవు చేయలేవు. వయసుచేత చిన్నవాడవు. నాకొడుకు బదులు నేను యజ్ఞపశువ నగుదు ననగా వరుణుడు న న్నీ కారణములు చెప్పి నేను పనికి రా నన్నాడు.

శున : హరి యైనచో వెంటనే యజ్ఞ మారంభింపుడు.

రోహి : నాయనగారూ! క్షమింపుడు. అజ్ఞుడనై పారిపోయితిని. మీ

హరి : వ్యాధియన్న వ్యాధియా యిది!

నదులు ప్రవహించు[చు]న్నవి నా కడుపున
నగము లాడుచునున్నవి నా కడుపున
ఊపిరాడుట లేదు నీ వాగిని వచ్చి
నపుడె యీమాత్రమైన మాటాడుచుంటి.

శున : సర్వమును యజ్ఞాభిముఖమై యున్నదికదా! అందుచేత మీకు నెమ్మది యిచ్చినది. యజ్ఞావసానమునకు వ్యాధియే యుండదు.

హరి : అది కాదయ్యా! వ్యాధిమాట యటులుంచుము. నే నబద్ధము చెప్పితి నందురేమి? కొడుకు ననుపనీతుని యజ్ఞపశుత్వమున కనర్హుడని వరుణు డంగీకరించినదే. అది నాయందు దోషముగా జెప్పె నెట్లు?

శున : లోకమునకు నీతి యేమి?

హరి : వరుణుడు దైవముకదయ్యా!

శున : దైవము మాత్రము లోకములోనివాడు కాడా! అది వేరేలోక మగుట కాని.

హరి : ఇంతటి మేధాశాలివి నిన్ను యజ్ఞపశువుగా నెట్లు చేయుచుండు? ధనమున కాశపడి నీ తండ్రి నిన్నెట్లు వదలిపెట్టెను?

శున : ధన మిచ్చి నీకొడుకు నన్నెట్లు తెచ్చెను? ప్రాణమునందలి తీపిచే నీకొడు కిట్లు చేసెను. ధనమునందలి యాశచే యాయన యట్లు చేసెను. ఒకటి ప్రాణమునందలిది, రెండవది ధనమునందలిది. రెండును ఆశలే.

హరి : ఇంత హృదయపరిశీలన చేసెడివాడవు నాయందు మాత్రము దోషము చూపింపవా?

శున : నీయందేనా! నాయందు దోషము లేదా?

రోహి : నాయనగారూ! ఈయన నీయన తండ్రి మందమతి యనుకొను చున్నాడు.

శున : దానికి గారణము వేరే యున్నది. తండ్రి సాక్షాత్పరదైవతము. ఆయన యెదుట నే నేమియు మాటాడెడువాడను గాను. ధర్మము కాదుగదా!

హరి : ఆతండ్రి యమ్మినా డని పశువుగా వచ్చినావా ? నీబుద్ధిపూర్వకముగా వచ్చినావా ?

శున : నాబుద్ధి, నాయంగీకారము, నాయాలోచన తండ్రియాజ్ఞ విషయములో లేవు. తండ్రియాజ్ఞబడి నేను పట్టిపశువను. ఈ శరీర మాయనవలన గలిగినది ఈ శరీరముమీద నాయన యధికారి. కనుక వెంటనే యజ్ఞ మారంభింపుము.

హరి ; ఆరంభించుట కే మున్నది ? కడచిన పదియేండ్లనుండి నిత్యము సర్వము యజ్ఞాభిముఖముగానే యున్నది. పైగా గొడుకు తా నంగీకరించునని యెంచి సర్వర్షులను బిలిపించితిని. సర్వసంభారములను సమకూర్చితిని ఆరంభించుటయే ఆలస్యము.

శున : మరి చూడుము. లోకము నిన్నబద్ధమాడితి వనుచున్నది. సరేగాని యే యే ఋషులు వచ్చిరి ?

హరి : జాబాలి, కశ్యపుడు, అత్రి, అంగిరసుడు, వశిష్ఠుడు అందఱును వచ్చిరి.

శున : విశ్వామిత్రమహర్షి వచ్చెనా ?

హరి : ఆయనయును వచ్చెను. ఆయన యెందులకు రాడు ? ఆయన మా వంశీయుడే కదా !

శున : అవునయ్యా! ఆ మహర్షి యుదయించుటచేత మీ వంశ మేమి, సర్వ జగత్తును పవిత్రమైనది

హరి : విశ్వామిత్రు డన్నచో నీ కెంత గౌరవ మున్నది ?

శున : నా కేమి ? ఎవరి కుండదు ?

తాను రాజయి రాజర్షియై నిరంత
తపముచేత బ్రహ్మర్షియై తనకు దానె
పాటిమైయున్న యా ఋషీశ్వరుడె నేను
శానుగా వాని కొడుకైన గానుగాదె!

హరి : ఓయి శునశ్శేపుడా! నీవు విశ్వామిత్రుని కొడుకైన వానని యెంత యనుకొనుచుంటివో నేను నీకు దండ్రినైన వానని యంత యనుకొనుచుంటిని.

శున : ఓయిరాజా! నీ కా దిగు లెందుకు? నీవు నాకు దండ్రి వగుటయే కాద టయ్యా! నీ కొడుకునకు మాఱు నేను నీయజ్ఞమున బలి వగుట.

(జలపాత ధ్వని)

హరి : ఓయి బ్రాహ్మణవటువా! నీ కెంత ఋణపడితి నయ్యా? వరుణదేవుడు వచ్చుచున్నాడు. ఉఱుములతో, మెఱుములతో వచ్చెడువాడు జల పాతధ్వనులతో వచ్చుచున్నాడు. ప్రసన్నుడై వచ్చుచున్నాడయ్యా!

వరు : ఓయి హరిశ్చంద్రా! నీ కొడుకు తిరిగి వచ్చినాడట గదా!

హరి : వచ్చినాడు స్వామీ!

వరు : మరి యజ్ఞపశువును జేసెదవా?

హరి : చిత్తము. కాని, ప్రభూ! అతనిబదులు నేను యజ్ఞపశువుగా నగుట పరిగ్రహించుటకు మీ రేమి యభ్యంతరములు చెప్పితిరి?

వరు : ఇతరదేవతాభావము లగులని మనఃప్రవృత్తి కలవాడే నాకు పశువుగా గావలె నని చెప్పితిని.

హరి : అట్టివాడు నాకొడుకే కావలెనా? మరి యెవరైన బనికివత్తురా?

వరు : నీ కొడుకు సుక్షత్రియవంశజాతుడు కదా!

హరి : వాడు సుబ్రాహ్మణవంశజాతుడైనచో......

వరు : మఱీ నయము.

హరి : అంతియే కాదు. అతడు పశుత్వమున కంగీకరించినవాడు. నాకొడు కంగీకరింపనివాడు.

వరు : అయినచో మఱియు నిష్టముకదోయి!

హరి : ప్రభూ! ఈ బ్రాహ్మణబాలకుని నీవు గ్రహించి నే నబద్ధమాడితి నన్న దోషమును బరిహరించెదవా?

వరు : తొలుత నీ వబద్ధమాడితి వన్న దోషమే లేదు. పరిహరించుట యెట్లు ఘటిల్లును?

హరి : నేను అబద్ధమాడనివాడ నైనచో, నన్ను జలోదరవ్యాధి గలవానిగా నేల శపించితివి?

వరు : ఓయీ! నేను యజ్ఞపశువునుండి నిగ్రహీతుడనై కోపమంది, నిన్ను శపించితినిగాని నీవు మృషావాది వగుటచేత గాదు, సరి! యజ్ఞ మారంభింపుము.

హరి : ఆరంభింపనేపడితది. సర్వర్షులు విచ్చేసిరి. ఈ బ్రాహ్మణబాలుని తండ్రియు వచ్చినాడు.

వరు : అతని తండ్రియు వచ్చెనా! దివ్యముగా నున్నది. దిక్కులేనివానిని నేను పశువుగా వరించుట లేదన్నమాట.

హరి : చిత్తము. అన్నియు సిద్ధమైనవి. అతిరాత్రోక్థ్యాదిక్రతువు లైనవి ఇంక బశుభూతుని యూపమునకు బంధించుటయే వశిష్టము. స్వామీ! జమదగ్నిమహర్షీ! నిన్ను నేను అధ్వర్యుడుగా వరించితిని. నీ వీపశు వైన బ్రాహ్మణబాలుని యూపమునకు బంధింపుము.

జమ : ఓయీ! రాజా! ఈ క్రూరకర్మ నేను చేయను. కర్మభాగమైన మంత్రక్రియలు మాత్రమే చేయుదునుగాని తేజస్వంతుడైన బ్రాహ్మణ బాలుని యూపమునకు బంధించుటవంటి క్రూరకర్మ నేను చేయజాలను

హరి : స్వామీ! పశువును యూపమునకు బంధింపక హింసించుట యెట్లు?

జమ : ఎట్లో నాకు తెలియదు ఇం దెంతమందియో ఋత్విక్కు లున్నారు. వారి నడుగుము.

హరి : మహర్షులారా! మీ రెవ్వరైన నీబాలుని యూపమునకు బంధింపుడు.

అందఱు: మేము చేయము. ఈ క్రూరకర్మ మేము చేయము.

విశ్వా : రాజా!

వరు : ఓయీ! విశ్వామిత్రు డేదో చెప్పబోవుచున్నాడు. వినుము.

హరి : బ్రహ్మర్షీ! నా కిప్పుడు గతి యేమో చెప్పుము.

విశ్వా : ఓయీ రాజా! ఈ క్రూరకర్మ యెవ్వరును జేయరు. చేయవలసినవా డొక్కడే యున్నాడు. ఏ యితనితండ్రి వందగోధనము గ్రహించి యితనిని బశువుగా నిచ్చినాడో, ఆ తండ్రియే యితనిని యూపమునకు బంధింపవలయును.

హరి : ఓయి అజీగర్త బ్రాహ్మణుడా! నీ కుమారుని నీవే యూపమునకు బంధించి పెట్టుము. నీ వట్లు చేయనిచో నాకు నీకొడుకును యజ్ఞ పశువుగా నిచ్చి యేమి లాభము?

అజీ : రాజా! మఱి నా కేమి లాభము? కొడుకును యజ్ఞపశువుగా నిచ్చుట చేత నిదివరకే క్రూరకర్ముడ నయితిని. మరల క్రొత్తగా నగుట యేమున్నది? తొలుతటిది వందగోవులకు జేసితిని. మఱి దీని నేమి చూచి చేయు మందువు?

హరి : అయ్యా! మఱి వందగోవు లిచ్చెదను.

అజీ : ఆజ్ఞ చేయుదును. ఓయి శునశ్శేపుడా! రమ్ము. నిన్ను యూపమునకు బంధించుచున్నాను.

(అందఱు - ఛీ ఛీ)

వసి : ఓయి! హరిశ్చంద్రా! ఇంతపగకు సరిపోయినది. యూపమునకు బంధింపబడియున్న పశువును వధించువా రెవరు?

విశ్వా : బంధించుటకే యంగీకరింపని యెవరు వధింప నంగీకరింతురు? అదియును తండ్రియే చేయవలయును.

హరి : అయ్యా! అజీగర్త బ్రాహ్మణుడా! ఈ పనికూడ నీవే చేయవలయును. నీవు చేయనిచో యజ్ఞపశువుగా నీ కొడుకును నా కిచ్చి ప్రయోజన మేమి కలదు? యజ్ఞపశువుగా నిచ్చుట వధింపబడుటకే గదా!

అజీ : రాజా! ఇతని వధకు నేను మున్నె యంగీకరించితిని. ఇప్పుడు నేను కాదని యేమి ప్రయోజనము! మఱి దీనివలన నా కేమి లాభము?

హరి : మఱియు నింకొక వందగోవు లిచ్చెదను.

అజీ : ఓయి శునశ్శేపుడా! ఇదిగో యూపమునకు బంధింపబడిన నిన్ను - వరుణదేవతాపశువవైన నిన్ను వధించుటకు సిద్ధముగా నున్నాను.

(అందరు బిగ్గరగా - ఛీ ఛీ)

శునశ్శేపుడు : (పాట)

నెటి నంతరిక్షస్థానీయులౌ వేల్పులలో
వరుణుడూ ప్రధానుడూ
రాత్ర్యభిమానీ బలపరాక్రమశాలీ
వరుణానీకన్న విహ్వాల వేగశాలులౌ
మఱి దేవతలు లేరూ, పరాక్రమ
స్ఫురణ హానిదె వేలూ.
పరగ నైదగు భూతములు సం
భరిత తేజో విహ్వాలములై
తిరుగు వరుణుని చుట్టు
రాత్రించరధురా సంభరితపై ఖరి.—నెటినంత
అంతరిక్షగతుడై ఆకాశమున పోవు
అండజాదుల స్థానమూ
అంభోధిగతు డౌచు నమ్మార్గముల నేగు
యాదస్సతుల స్థానమూ
జననమృత్యువుల సంస్థానము తెలిసిన
సాధుమోహనమూర్తి - వరుణుడు
వరమదయుచే యూపమున
నీపగ్గిది బంధింపంగబడి దు
ర్మరణమందుచున్నన్న నాపై
మహితకృప వహియించుగాపుత - నెటి నంతరి.

అజీ : ఓయి శునశ్శేపుడా! ఏమోయ్! స్తోత్రములు చేయుచున్నావు! నీవు గాయకుడవని, కవివని రోహితుడు చెప్పినాడు. నేను విశ్వసించలేదు. నా కడుపున బుట్టినావు. నా యింట బెరిగినావు. నే నెన్నడు నీ యీ లక్షణ మెరుగను. యూపబద్ధుడవై ఋషివలె గానముచేయుచున్నావు.

శునశ్శేపుడు : (పాట)

సప్తసింధురాజా, వరుణుడు
సప్తసప్తితేజా, వరుణుడు
మరణవేళ నేనూ, వరుణుని
మహిమవంతు శరణూ, చొచ్చితి
దురితనిగళములనూ త్రెంచుచు
పరమకృపను జూమా, వరుణుడు
సప్తసింధురాజా –

వరు : ఓయి శునశ్శేపుడా! నీవు మహర్షి వైతివి. మంత్రద్రష్ట వైతివి. నిన్ను నేను పశువుగా నంగీకరింపను. నీయూపబంధనములు తెగిపోవుచున్నవి. నిన్ను నేను విముక్తుని జేసితిని.

శున : ఓయి వరుణదేవా! కృతార్థుడను. ఈ హరిశ్చంద్రునకు యాగఫలమిమ్ము నన్ను వదలిపెట్టియు నరమేధఫలము హరిశ్చంద్రునకు ప్రాప్తించునట్లు దయచూడుము.

వరు : ఓయి ఋషీ! అస్మద్దేవతాకములైన ఋక్కులు వేదభాగమునందు తప్పకుండగా గలవు. అందుచేత నిది యంతయు నేను పన్నిన పన్నుగడ. నీకీర్తి సర్వవేదమార్గములందు ప్రకాశించును. అదిగో సర్వఋత్విక్కులును నిన్ను ప్రశంసించుచున్నారు. నీమహిమచేత నీయజ్ఞము సంపూర్తి నందినది. నీ యిచ్చవచ్చిన చోటికి నీవు పోవచ్చును.

శున : వరుణదేవా! నాతండ్రి నన్ను యజ్ఞపశువుగా నమ్మివేసెను. నే నిప్పు డెచ్చటికి బోదును?

వరు : నీ విప్పుడు మంత్రద్రష్ట వైతివి. ఈ యెల్ల ఋషులును ని న్నిపుడు పుత్త్రునిగా స్వీకరించుటకు సిద్ధముగా నున్నారు.

శున : అట్లయినచో నేను విశ్వామిత్రుని నా తండ్రిగా వరించుచున్నాను.

అజీ : ఓయీ! నేను నీ తండ్రిని. నన్ను వదలి యెందుకు పోయెదవు?

విశ్వా : ఓయీ అజీగర్తుడా! ఇతడు నన్ను తండ్రిగా వరించినాడు. ఇతనిని ప్రజాపత్యాదిదేవతలు రక్షించి నా కిచ్చినారు. ఇతనిని దేవతలు రక్షించినారుగావున నేటినుండి దేవరాతుడని పిలువబడును.

అజీ : నాయనా! మన యింటికి పోదము రావోయి! నీ వాంగిరసుడవు. అజీగర్తుడవు మంత్రద్రష్టవు. మన గోత్రము వదలి వెఱగోత్రమును బోషింపకుము.

శున :

అకట పశువుగాక నమ్మిన యప్పుడు
కాను సుతుడనే, నేడు గాను సుతుడ
గత్తిఁబూని నాదు కంఠమ్ము కోయుగా
నైన యప్పుడు నేను గాను సుతుడ.

ఇప్పుడు సుతుడనేను. నీవు సంపాదించిన మూడువందల గోవులను నేను కాదులేను. నీపాపము ప్రతిసమాధేయము కాదు. నేను రాను. పొమ్ము.

విశ్వా : దేవరాతా! నాయనా! రావోయి! వేద మార్గములందు మంత్రద్రష్టల సమూహమునందు నా పేరుతో గలసి నీ పేరు మండలసంచారము చేయుగాక!

శున : బ్రహ్మర్షీ! రాజర్షిత్వమును బ్రహ్మర్షిత్వమును జేసినవాడవు - నా యాంగిరసత్వమును వైశ్వామిత్రత్వముగా జేయుము. నీవెంటనే వచ్చుచున్నాను.

హరి : ఓ ఋబ్మండల సంచార దేవతలారా! మహర్షులారా! ఇది యంతయు నా కేదో యబద్ధదోషము గల్పింప కించిన వ్యూహముగా భావించితిని.

నాహృదయమునందు లేని యబద్ధపు దుర్భావములు కల్పించిరి. వరుణ దేవుడే ప్రత్యక్షముగా వది లేదనను. ఇది యంతయు నూత్నము. తరణవాంఛనపై వరుణదేవుడు కల్పించిన కథ. ఓ మహర్షులారా ఓ ఋగ్విప్రులారా! విశ్వామిత్ర దేవరాతులారా! మీతో పాటు గూడ—

యజ్ఞవాట్యమ్ములందు జరించుచుందు
స్వజ్ఞవాజ్యము లెల్ల హరించుచుందు
యజ్ఞాకారము సమర్థించుకొందు
ప్రాజ్ఞవక్త్రాళిలో మూర్తి ప్రబలుచుందు.

